# GANDHI
# THE MAN AND HIS MISSION

# గాంధీ లక్ష్యాలు - ఆశయాలు

మూలం

నిర్మల్‌కుమార్ బోస్

తెలుగు సేత

సురభి నరసింహం

ప్రకాశకులు

గాంధీ సాహిత్య ప్రచురణాలయము

(ఆం. ప్ర. గాంధీ స్మారక నిధి)

సుల్తాన్‌బజార్, హైదరాబాదు-500001

ప్రథమ ముద్రణ

ప్రతులు : 1000

ఆగస్టు 1

వెల : రు. 2-00

గాంధీ సాహిత్య ప్రచురణాలయము
100 వ ప్రచురణ

భారత ప్రభుత్వమువారు సరసమైన వెలకు లభింపజేసిన కాగితముపై ఈ పుస్తకము ముద్రించబడినది.

ముద్రణ :
వేంకట్రామ పేపరు ప్రోడక్ట్సు (ప్రై) లిమిటెడ్
నారాయణగుడ, హైదరాబాదు-29.

# ప్రకాశకుల నివేదన

భారత ప్రభుత్వపు గాంధీతత్వాభివృద్ధి ప్రణాళిక ననుసరించి ప్రతి సంవత్సరం, జాతీయ ప్రముఖులొకరిచే ఏదో ఒక భారతీయ విశ్వవిద్యాలయంవారు మూడు ఉపన్యాసాలిప్పిస్తారు. ఇవి గాంధీతత్వం విషయంలో వెదికి తీసిన అమూల్య రత్నాల వంటివి. ఈ ఉపన్యాసాలను ఇంగ్లీషులో ఎప్పటి కప్పుడు "భారతీయ విద్యాభవన్" వారు ప్రకటిస్తున్నారు.

ఈ ఉపన్యాస పరంపర ప్రణాళికలోనిదే ఈ పుస్తకం. ఉపన్యాసకులు, సుప్రసిద్ధ గాంధీయ తత్వవేత్త శ్రీ నిర్మల కుమార్ బోస్. వీరు గాంధీజీకి ఆదినుండి సన్నిహితులు కారు. గాంధీజీ ఎడ పూజ్యభావంతో వారి కార్యక్రమాల నన్నింటిని తూచ తప్పకుండా అనుసరించనూ లేదు. అంతమాత్రాన గాంధీజీ ఉద్యమాల పట్ల ఉదాసీనులుగాను లేరు. ఆ ఉద్యమాన్ని విమర్శనాత్మక దృష్టితో పరికిస్తూ క్రమంగా ఆయన ఉద్యమాలవల్ల ఆకర్షితులై నారు, సన్నిహితులై నారు. 1946 లో కలకత్తాలోను, బెంగాల్‌లోని ఇతర ప్రాంతాలలోను అల్లర్లు చెలరేగినప్పుడు గాంధీజీ ఒంటరిగానే కలకత్తాలోను, నౌఖాళీలోను పర్యటించి నప్పుడు ఈ రచయిత వారివెంట నున్నారు. అతి సన్నిహితంగా వుండటంతోను, స్వయంగా

విజ్ఞానవేత్త కావటంవల్లనూ గాంధీజీని, ఆయన వ్యక్తిత్వాన్ని, ఆయన లక్ష్యాలనూ, ఉద్యమ విధానాలకు సమీపంగా వుండి పరిశీలించారు. గాంధీజీ అభిప్రాయాలతో గాని ఎత్తుగడలతో గాని, ఎక్కడనైనా స్వల్పమాత్రం అభిప్రాయభేదం వున్నప్పటికీ ఆయన గొప్ప గాంధీభక్తుడైనాడని చెప్పవచ్చు. గాంధీజీ వ్యక్తిత్వా ననుసరించి ఆయన తత్వాన్ని, అనేక పుస్తకాలుగా వ్రాశారు. ఈ మహనీయుడు ఇటీవలనే పరమపదించారు.

ఈయన జాధవపూర్ విశ్వ విద్యాలయంలో 1968 మార్చి 12, 13, 14 తేదీలలో ఇచ్చిన 3 ఉపన్యాసాల సంపుటి ఇది. దీనిని "Gandhi the man and his mission" అనే పేరుతో భారతీయ విద్యాభవన్ వారు ప్రచురించారు. గాంధీ శతజయంతి సందర్భంలో ప్రచురించ వలసిన పుస్తకాలలో ఒకటిగా దీనిని ఎన్నిక చేయటం జరిగింది. శ్రీ సురభి నరశింహం గారు దీనిని తెలుగులో అనువదించారు. శ్రీ నరశింహంగారు సంస్కృతాంధ్రాంగ్లములలో పండితులు మాత్రమే కాదు సుప్రసిద్ధ విద్యావేత్త. వారి ప్రసంగాలు తరుచుగా ఆకాశవాణిలో వినిపిస్తూ వుంటవి. వీరు దీనిని అనువదించి ఇచ్చి చాలాకాలమైనప్పటికీ అనివార్య కారణాలవల్ల ప్రచురణ ఆలస్యమైంది. ఇందుకు వారినీ పాఠకులనూ క్షమాపణ వేడుకొంటున్నాము. దీన్ని సుప్రసిద్ధ భాషావేత్త మా సంపాదక సమితి సభ్యులునైన డాక్టరు అడపా రామకృష్ణారావుగారు సరిచూచారు. ఎట్టకేలకు ఈ పుస్తకాన్ని ఇప్పుడు ప్రచురించగల అవకాశం చిక్కింది.

దీనిని మా ప్రచురణాలయం నూరవ ప్రచురణగా పాఠకలోకానికి అర్పిస్తున్నాము.

మాకు "గాంధీ తత్వాభివృద్ధి" (Promotion of Gandhian Philosophy) ప్రణాళిక ననుసరించి జరిపే ఉపన్యాస పరంపరను తెలుగులో అనువదింపచేసి ప్రచురించుటకు భారత ప్రభుత్వ విద్యాశాఖ వారు అనుమతించారు. ఈ ప్రణాళికలోని అనేక ఉపన్యాస సంపుటాలను ఇప్పటికే ప్రచురించారు. ఈ సంపుటి చిన్నదైనా గాంధీజీని ఆయన ఉద్యమ విధానాన్ని అవగాహన చేసికొనుటకు చాలా ఉపకరించగలదు

గాంధీ తత్వాభివృద్ధి ప్రణాళిక ననుసరించి జరిగే ఉపన్యాస పరంపరను తెలుగులో ప్రచురించటానికి అనుమతించిన భారత ప్రభుత్వ విద్యాశాఖ వారికీ, అనువాదకులు సురభి నరశింహంగారికీ, సరిచూచిన డా. అడపా రామకృష్ణారావు గారికీ, మా కృతజ్ఞత. దీన్ని అనతి కాలంలో ముద్రించి ఇచ్చిన వేంకట్రామ్ పేపర్ ప్రోడక్ట్సు వారికీ మా అభినందనలు.

ఇట్లు,
కోదాటి నారాయణరావు
కార్యదర్శి
సంపాదక సమితి.

గాంధీ సాహిత్య ప్రచురణాలయం
గాంధీ జ్ఞానమందిరం
సుల్తాన్‌బజారు, హైద్రాబాదు-1
25-8-1976

# గాంధీ వ్యక్తిత్వము

గాంధేయతత్వాన్ని గురించి మాట్లాడవలసినదిగా మీరు నన్ను పిలవడం నాకెంతో గౌరవం చేసినట్లుగా భావిస్తున్నాను. నేను తత్వశాస్త్ర మభ్యసించినవాడను గాను; కాని గాంధీజీ ఆర్థిక, రాజకీయాధారాలపై నాకు చాలా ఆసక్తి ఉన్నది. ఆ ఆదర్శాలతో ప్రమేయమున్నంతవరకు గాంధేయతత్వంపట్ల కూడా నాకు ఆసక్తి ఉన్నది. ఇప్పుడు గాంధేయతత్వం చర్చించడంలో, నేనేమైనా కొంచెం, వ్యక్తిగత ప్రస్తావన అప్పుడప్పుడు చేస్తే, నన్ను మీరు మన్నించగలరని ఆశిస్తాను. ఈ విధంగా ప్రస్తావించవలసి రావడం గాంధీజీని గూర్చి కొన్ని సంగతులు విశదపరచుటకు మాత్రమే గాని; మరెందుకూ కాదు.

1921 నుండి గాంధీ ఉద్యమంతో మాకు సంబంధం ఉన్నప్పటికీ అప్పటిలో నేను మాత్రం సహాయ నిరాకరణోద్యమానికి ఇంచుమించుగా వ్యతిరేకి ననే చెప్పాలి. నేను భూగర్భ శాస్త్ర విద్యార్థి నగుటచేత, ఇంతగా నాగరికత విస్తరించిన కాలంలో ఎవరో ఒకాయన ముందుకువచ్చి, నూలు వడకడం వంటి కృతయుగంనాటి ఉత్పత్తి పద్ధతుల నవలంబించ మనడం చాలా ఆశ్చర్య మనిపించింది. సహజంగా ఇట్టి విరుద్ధభావం

పుట్టినా, బ్రిటిషు సామ్రాజ్య శక్తిని ధిక్కరిస్తూ ఆయన పవాలుచేసిన విధానం, ఆయన మాటలలోని అసామాన్య ధీరత్వం, మాలో చాలామందిని చిత్రంగా ఆకర్షించింది. బ్రిటిషు పాలనను ధిక్కరిస్తూ స్వరాజ్యంకోసం ప్రాణార్పణం చేసిన ధీరులింకా ఎందరో బంగాళంలోను, మహారాష్ట్రంలోను పంజాబులోను ఉన్నారు; కాని గాంధిజీకి, వీరికి కొద్దిగా భేద ముంది అదేమిటంటే,- బంగాళములోని విప్లవ వీరులు దేశ మును చావునోవులనుండి తప్పించుటకుగాను వారి ప్రాణములు బలిపెట్టుచుండగా, దేశములోని సామాన్య ప్రజానీకము కొంత నిస్తబ్దత వహించారు. 1921 కి పూర్వము రాజకీయంగా జన సామాన్యం కూడా పాల్గొన్న ఉద్యమము లేనేలేదు. వారి దాస్యాన్ని తొలగించుకోవడానికి పంటకాపులు, ఆదివాసులు ఎన్నైనా తిరుగుబాట్లు లేవదీశారు; కాని, అట్టి ఆర్థికసంబంధ మైన విప్లవాలు ఇండియాను పాలిస్తున్న విదేశీయ ప్రభువుల నుండి రాజ్యాధికారమును తిరిగి లాగుకొనుటకు మాత్రం ఉద్దేశింపబడినవి కావు గాంధేయోద్యమంలో మాత్రము, మహోన్నత స్థాయినందిన సహాకారముతోను, దేశభక్తితోను యావత్ప్రజానీకము ఉవ్వెత్తుగా లేచి నిల్చినట్లు కన్పడుతుంది. అందుచేతనే గాంధిజీ చెప్పిన వస్తూత్పత్తి విధాన మెంత పూర్వకాలపుదైనా ఆయనవల్ల మేమంతగా ఆకర్షింప బడ్డాము.

కాని తరువాత నేను రాజకీయరంగం వీడి, గాంధేయ సారస్వత పఠనంలో నిమగ్నమైనప్పుడు 1921-22 ఉద్యమం గాని, తరువాతి ఉద్యమాలు గాని తరుచు విఫలం కావడానికి

కారణం మానవ స్వభావాని కతీతంగా గాంధీజీ ఆశించడంవల్ల కాక, తరచు వారి ప్రణాళికలను తెలివితక్కువగానో, గ్రుడ్డి ఎద్దు చేలో పడినట్లుగానో అమలు పరచడంవల్లనని నాకు తోచింది. వ్యక్తిత్వంలో సమ్మోహకశక్తి ఉన్నదని చాలా మంది నమ్మకం. ఈభావం గాంధీజీ సమకాలీనులైన అగ్రశ్రేణి దేశనాయకులలోనే ఉండేది. మాటవరుసకు, 'దేశబంధు'— చిత్తరంజనుదాసును తీసుకోండి. గాంధీ రాజకీయాభిప్రాయాలతో ఆయన పూర్తిగా ఏకీభవించలేదు; అయినప్పటికీ, జాతీయోద్యమంలో దూకే విషయం వచ్చేటప్పటికి, తనకున్న సంశయాలన్నిటినీ తీసి గట్టునపెట్టి ప్రజావాణీ, ప్రజాశక్తుల ప్రతినిధిగా విశ్వరూపం దాల్చి నిల్చిన మహాత్ముడికి దాసోహమన్నాడు.

ఇట్టి పరిస్థితులలో, గాంధీజీ అభిప్రాయాలను, ఫలవంతంగా అమలులో పెట్టుటకైనా, వానిని త్రోసిపుచ్చుటకైనా ముందు వానిని బాగా అవగతం చేసికోవడం అవసరమని కొందరు గ్రహించారు.

గాంధీజీతో నాకు తొలిపరిచయం 1934 లో లభించింది. వార్ధాలో మహిళాశ్రమంలో వారుంటూన్నప్పటి సంగతి ఇది. పై అంతస్థులో వారిగదిలో మొట్టమొదట వారిని సందర్శించినప్పుడు, తండోపతండాలుగా జనం వస్తూపోతూ ఉండే ఆగది ఎంతో శుభ్రంగా ఉండడం చూసి చకితుడనయ్యాను. గాంధీజీ ఆగదిలో మధ్య చిన్నబల్లమీద కాగితాలు పెట్టుకొని వ్రాసికొంటున్నారు. అప్పుడు నాతో ఇంకా సరిహద్దుగాంధీ అబ్దుల్

గఫార్ ఖాను, రసాయనశాస్త్రజ్ఞుడైన ఆయన కుమారుడు అబ్దుల్ ఘనీఖాను, శాంతినికేతన నివాసి ఆచార్య కృపలానీ కూడా ఉన్నారు. అబ్దుల్ గఫార్ ఖానుకు, కొడుకునకు మధ్య ఒక అభిప్రాయభేదం పొడసూపింది. కొడుకు కళాకారుడు, రాసాయనికోద్యోగికూడ; జాతీయోద్యమంలో పాల్గొనడ మతనికిష్టంలేదు. కాని సరిహద్దు పశ్చిమోత్తరపరగణా రాష్ట్రం లోని పేద ప్రజానీకం సేవకై తన కుమారుని శక్తియుక్తు లుపయోగపడాలని తండ్రి అభిలాష.

గాంధీజీ వారిద్దరిమధ్య తగవు తీర్చవలసి ఉంది. ఆయన ఆచార్య కృపలానీవైపు తిరిగి, "అబ్దుల్ ఘనీఖాను గురించి అతని కళాశాలా ప్రధానాచార్యుడైన నందలాల్ బోసుగారి అభిప్రాయ మేమిటి?" అని ప్రశ్నించారు. "ఘనీ-తెలివితేట లను నందలాల్ ప్రశంసించారేగాని, అతడు కళతో పరసా లాడుతున్నాడే గాని శ్రద్ధవహించడంలేదన్నా"రని కృపలానీ బదులుచెప్పారు. గాంధీజీ పకాలున నవ్వుతూ, "పోనీకాని, మరి దేనితోనూ సరసాలాడకుండా మాత్రం చూడు"-అన్నారు; మరిన్ని, కొడుకు ఇచ్ఛకు అడ్డుపడవద్దని తండ్రికి సలహా యిచ్చారు. ఒకవేళ ఎప్పుడైనా, నిరతురాస్యులైన తన దేశ ప్రజల కతడు తన శక్తియుక్తులు వినియోగపరచాలని సంక ల్పిస్తే, అతని కప్పుడు తోడ్పడవలసినదిగా సూచించారు. అంతవరకు తన రసాయనశాస్త్రంవల్ల జీవనోపాధి సంపాదించు కొంటూ, విరామకాలంలో కళాభ్యాసం చేసికొమ్మని సూచిం చారు. నాకిది చాలా ఆశ్చర్యం కలిగించింది. ఏమంటే - ప్రతి శాస్త్రవేత్త, ప్రతివిద్యాంసుడు, బీదప్రజల సేవకై వెంటనే

తమతమ శక్తులను వినియోగపరచాలని గాంధీజీ సలహా ఇస్తా రని అనుకొన్నాను.

ఘనీ సంగతి అయినపిమ్మట గాంధీజీ నావైపు తిరిగారు. నేనప్పుడు నాలుగు ప్రశ్నలను వ్రాసి ఆయన ఎదుట పెట్టాను. అంతటాయన వాటిని పరిశీలించి, అవి వ్యక్తిగతమైనవికాక రాజకీయ, సాంఘికపరమైనవి గనుక అక్కడ ఉన్న నలుగురి తోనూ చర్చింపవచ్చునా అని నా అంగీకృతి నాకాంక్షిం చారు.

అందులో రెండు ప్రశ్నలనుగూర్చి ఆవిధంగా అందరం చర్చించేసరికి గాంధీజీకి సాయంత్రపు షికారువేళ అయింది. అందుచేత మా సంభాషణ మరునాటి మధ్యాహ్నానికి వాయిదా పడింది; వారితో మేమున్నూ బయటికి సాగాము. గాంధీజీ అంత పొడగరికాదు; కాని ఆయనతో సమంగా నడవడానికి ఆరడుగులు మించిన అబ్దుల్ గఫార్ ఖాను పెద్దపెద్ద అంగలు వేస్తూ పరుగెత్తవలసి వచ్చింది. ఒక మైలు నడిచాక గాంధీజీ తిరుగుముఖం పట్టి, కొంచెం పెద్దపెద్ద రాళ్లు ఒడిలో వేసికొని రాగా, తక్కినవారందరూకూడా, అదేవిధంగా చేయసాగారు. తోట గుమ్మంద్వారా ఆశ్రమంలో ప్రవేశించి, ఆ రాళ్లన్నీ క్రింద పోయగా ఒక పెద్ద గుట్ట ఏర్పడింది. ఆశ్రమంనుండి రహదారీవరకు ఉన్న ఒక ఫర్లాంగుమేర ఒక రోడ్డును నిర్మించ డానికి తగ్గ సామగ్రిని గాంధిజీ ప్రోగుచేయడానికి సమకట్టారని అప్పుడు అబ్దుల్ గఫార్ ఖాను నాతో చెప్పారు. ఈ పని ఆశ్రమంలోనివారంతా చేయవలసిఉంది. వారాఖాట నుపయో

గించుకోనడము మాత్రమే కాకుండా, దాని నిర్మాణంలో వారంతా భాగస్వాములు కావలెనని గాంధిజీ అభిప్రాయం.

అనేక సంవత్సరాలపాటు గాంధిజీ జీవితం పరిశీలింపగా ఆయన పనిచేయుటకు ప్రయత్నించే ప్రణాళికలేవైనాసరే, వీటైనంతమంది ప్రజలను ఇరికించడమే ఆయన పద్ధతిగా నాకు ఎప్పుడూ తోచింది. 1947 లో బ్రిటిషువారు ఇండియాను వదిలిపోయినప్పుడు కాంగ్రెసుపక్షం అధికారంలోకి వచ్చింది; బంగాళం ప్రభుత్వం కాంగ్రెసుపక్షం చెప్పుచేతలలో ఉంది. ఆసమయంలో ఒక గొప్ప దొమ్మి చెలరేగింది; గాంధిజీ అప్పుడు కలకత్తాలో ఉండుటవల్ల, ఆ పట్టణవాసులకు తిరిగి వివేకం కలగాలని ఉపవాసదీక్షకు పూనుకొన్నారు. ఆ దీక్ష నుండి వారిని విరమింపజేయడానికి ఆ రాష్ట్రం గవర్నరు, శ్రీ రాజగోపాలాచారి సర్వవిధముల ఆ అల్లరుల నాపుటకు ప్రభుత్వం కృషి చేయగలదని హామీ యిచ్చారు. ప్రభుత్వమేలాగూ తనవిధిని నిర్వహిస్తుంది; కాని అప్పటిలో సామాన్య పౌరుడైన తానేమిచేయువలసి ఉండునని ఆయన విచికిత్స వెలిబుచ్చారు. రాజగోపాలాచారిగారింకేమనడానికి తావు లేకపోయింది. అందుచేత, కలకత్తా పౌరులు ఉద్రేకాన్ని విడనాడి ఎవరి నివాసప్రాంతంలో వారు శాంతి నెలకొల్పడానికి పూనుకొనునట్లు గాంధిజీ ఉపవసించారు. అట్లు ప్రజలందరు తమతమ వ్యక్తిధర్మముగా భావించి నడుములు కట్టుకొనగా శాంతి సంస్థాపనము నెరవేరినది. అది గాంధిజీ వ్యక్తులవల్ల అపేక్షించే కార్యదీక్ష. ఇందులో నిశ్చయంగా గాంధిజీ కృతార్థులయ్యారు.

ఈ సందర్భంలో నా అనుభవగతమైన మరికొన్ని సంగతులు జ్ఞప్తికి వస్తున్నాయి. 1945 లగాయతు మనదేశపు రాజకీయ చరిత్రలో చాలా చురుకుగా మార్పులు వచ్చాయి. ముస్లింలీగువారు బంగాళం ప్రభుత్వం నిర్వహిస్తుండగా, 1946 ఆగస్టు మధ్యలో, ఆ లీగువారి ప్రత్యక్షచర్య ప్రారంభమైంది. దీని వెనువెంటనే, శాంతి భద్రతలగూర్చి తగిన చర్య తీసికో వలసినదిగా ముఖ్యంగా ప్రభుత్వాన్ని కోరుటకుగాను, గాంధిజీ కలకత్తాకు వెళ్ళారు. మళ్లీ, తన హిందూ సోదరునిపట్ల ప్రతి సామాన్య ముస్లిం-రైతున్నూ సముచితంగా నడుచుకొమ్మని నచ్చచెప్పుటకుగాను గాంధిజీ నవకాళీకికూడ వెళ్లారు. ఈ సందర్భంలోనే గాంధిజీ సిబ్బందిలో ఒక ముఖ్యునిగా నన్నునూ్న పిలిచారు. అప్పుడు నేనుపనిచేస్తున్న కలకత్తా విశ్వవిద్యాలయం వారు నాకు అందుకు సెలవొసంగగా నేను నవకాళీకి పయనమై వెళ్లాను. గాంధిగారి బసకు చేరుకొనేటప్పటికి మాలో ఒకరిద్దరితో మాత్రమే వీలైనంతవరకు ఒక చిన్న పల్లెటూరిలో గాంధిజీ మకాం చేయుటకు నిశ్చయించుకొన్నట్లు తెలియవచ్చింది. ఆ సాహసకృత్యంలోని ప్రమాదాలు వివరించి, తనతో ఉండుటకు నాకేమైన కష్టముండునేమో అని ఆయన నన్ను ప్రశ్నించారు.

కొంచెం సంకోచిస్తూ "అందరి కష్టం తమదేకాని నాదికా" దన్నాను. కారణం, ఆయన ప్రార్థనాతత్పరులు, నేను కాను. "అయితే, నీకు భగవంతుడంటే నమ్మకమున్నదా లేదా?" అని ప్రశ్నించారు. "నాజీవిత సమస్యలలో భగవంతుడున్నాడా లేడా అన్న ప్రమేయం నాకెప్పుడూ కలుగ లే"

దన్నాను. అందుచేత ఆ విషయాల్ని గురించి నేనెప్పుడూ అంత పట్టించుకో లేదన్నాను. "అయితే నీ కెందులోనూ నమ్మకం లేదా?" అన్నారాయన. "అదెట్లు? మాటవరుసకు నాకు సత్యంలో నమ్మకమున్నది!" అన్నాను నేను. అంతట గాంధీజీ, "అయితే 'సత్యం' అంటే ఏమిటి?" అని గద్దించారు. "సత్యాన్ని నిర్వచించడం నాకు కష్టమైనపని. కాని ఒక శాస్త్రజ్ఞుడుగా ఇంత మాత్రం అంటాను : ఒక ప్రత్యేక పరిస్థితిలో ఉన్న యథార్థాన్ని గుర్తించడానికి యత్నిస్తాము. ఒక ప్రమేయాన్ని నిర్మించుకొని, దాని కార్య కారణ విశేషం గూర్చి తర్జనభర్జన చేస్తూ ఉంటాం కానీ, సత్యం ఎప్పటికీ దవీయంగానే కన్పట్టుతూ ఉంటుంది. అది ముట్టెనంటియున్న ముల్లంగిదుంప కోసం పరుగెత్తే గాడిద సామ్యంగా ఉంటుంది. అదీ సత్యాన్ని గురించి నేను చెప్పగలిగేది!" అన్నాను. "అయితే, నీవు సత్యం అనుకొనే దాన్ని గూర్చి, కష్టాలపాలు కావడానికి సంసిద్ధుడవేనా?" అని అడిగారు గాంధీజీ. "ఇది వ్యక్తికి సంబంధించిన ప్రశ్న గనుక, మానవుడెవడైనా అట్లు కష్టపడడానికి సంసిద్ధపడవలసినదే; నేనట్లు సంసిద్ధుడనా, అనే ప్రశ్న అసంగతం," అన్నాను నేను; "సరే! అయితే బాగుంది" అన్నారు ఆయన.

అలా కలిసిమెలిసి నెలలు గడిపాము; మూడు నెలలకు పిమ్మట, ఒకరోజున నేను. "ఆర్యా! భగవంతుని గూర్చి నాతో మాట్లాడరేమి? నాతప్పునుండి తప్పించను యత్నించరు?" అని ప్రశ్నించాను. "నాకు భగవంతుని యందొక విశ్వాసముం దనుకొంటాను; అలాగే జీవించుటకు ప్రయత్నమున్నా

చేస్తాను. కాని నాజీవితమే నీకొక సందేశ మీయలేకపోతే, మాట్లాడడమూ వ్యర్థమే" అన్నారు.. భగవంతుని యందలి విశ్వాసమునకు పరీక్షా సమయం ప్రాణప్రయాణ సమయమే నని ఆయన నమ్మకం. అప్పుడు చావు బ్రతుకులను గూర్చి సమచిత్త ముంచగలిగితే, అప్పుడే భగవంతుని యందలి విశ్వాసము ఋజువు కాగలదు.

ఈ సందర్భంలో, 1945 నాటి మరియొక సంఘటన నాకు గుర్తుకు వస్తున్నది. ఒకప్పుడాయన నన్ను పిల్చి, ఆయన రచనలను నేను చాలా జాగ్రత్తగా చదువుతూ ఉంటానని మెచ్చుకొన్నారు. కాని ఆయనను ఎప్పుడూ తప్పుగా చిత్రిస్తున్నానని ఆయన ఆరోపణ! అదెట్లాగంటే - తన రచనలు తన ఆశలను, ఆశయాలను చిత్రించునే గాని, అవి ఆయన విజయ పరంపర గాదనినీ, అందుచేత, ఆయన రచనలనుండి నేనేమైనా ఉటంకిస్తే గాంధీ నిజంగా ఉన్నదానికంటె ఎక్కువ పరిపూర్ణుడుగా ప్రజలను నమ్మించడం కాగలదనీ ఆయన వివరింప మొదలుపెట్టారు. అప్పుడు, "ఒకవ్యక్తి జీవితంలోని మహోచ్ఛ్రతుణాలు అతని యథార్థ స్వరూపాన్ని వెలిబుచ్చుతాయి. కాని, అతని దైనందిన సామాన్యతనుగా" దన్న రవీంద్ర కవీంద్రుని మాటల నుదహరించాను "అవును. అది ఆ కవీంద్రునిపట్ల నిజమే! కాని, నాబోటి సామాన్యుల విషయంలో - మా జీవయాత్రలో మా పాదాలపై ఎంతధూళి గూడుకట్టుకొన్నదో దానినిబట్టి మా కిమ్మతు గణించవలసి ఉంటుం" దన్నా రాయన. గాంధీజీవంటి మహనీయునిలో ఈ దృష్టి ఉండడం చాలా అద్భుతం! మరిన్ని, సామాన్య మానవ

అనుష్ఠానాలలో ఆయన కెంతనమ్మకమో- ఈ వైఖరి ఋజువు చేస్తుంది.

గాంధీజీకి రోజు ప్రొద్దుట నాలుగు గంటలతో ప్రారంభ మవుతుంది. కొన్ని సామాన్య విధులు నిర్వర్తించుకొన్నాక, ఆయన ప్రాతఃకాల ప్రార్థనవేళ అవుతుంది. ఆ సమయంలో కొన్ని గీతాధ్యాయాలు పఠించేవారు. ఆవిధంగా మొత్తం గీత ఒక వారంరోజుల్లో ముగియునన్నమాట. ఆపైని తేనెతో కలిపిన వేడినీళ్లు, వెంబడినే నారింజరసమో, ద్రాక్షరసమో ఒక గ్లాసెడు పుచ్చుకొని, తన బంగాళీ-పాఠాల కుపక్రమించేవారు. ఆయన ఒకప్పుడనినట్లు, ఈ బంగాళీ అసలెందుకు నేర్చుకోవడం మొదలుపెట్టారంటే, రవీంద్రనాథ టాగూరు కవితను మాతృకలో చదవాలని! ఆయనకు డెబ్బదేండ్లున్నా బంగాళీ నేర్చుకోడాని కసలు కారణం, ఉపనిషత్సందేశాన్ని, ఆ గీతా లందిచ్చాయనీ! ఆ బంగాళీ-పాఠంలో అపాఠ మొక్కొక్కప్పుడు పది నిముషాలు, మళ్ళీ యింకొక్కప్పుడు, ఒకటిరెండు నిముషాలు మాత్రమే ఉండేవి. ఒకరోజున, "ఇలా ఒకటిరెండు క్షణాలు భాషాభ్యాసానికి సరిపోతుందా?" అని అడిగితే,-"అది అథమపక్షం నా ప్రతిజ్ఞ నిలుపుకోవడానికి ఒక క్రమశిక్షణకు సరిపోతుంది!" అన్నారు.

ఏపని ఐనా సక్రమంగా చేయడంపట్ల గాంధీజీకి చాలా పట్టుదల. ఎవరైనా సంస్కృతం చదువుతున్నా, ఇంగ్లీషులో ప్రార్థనగీతాన్ని ఆలపిస్తున్నా అది సాధ్యమైనంత నిర్దుష్టంగా ఉండాలని ఆయన కోర్కె. ఒకనాడెవరో గీతాధ్యాయాలు

కొన్ని నిర్లక్ష్యంగా చదివేటప్పటికి, శబ్దోచ్చారణ తప్పు లేకుండా తగినంత జాగ్రత్తగా చదువకపోతే, అది అసమగ్ర పఠనం అనిపించుకోవడమేకాక, గీతాధ్యయన ప్రయోజనమే పాడవుతుందనీ, అపచారమవుతుందనీ హెచ్చరించారు. ప్రాతః ప్రార్థన, బంగాళీ పాఠం అయినతర్వాత షికారు వెళ్లేవారు. ఇదిమాత్రం విధిగా నిర్వహించేవారు; ఒకవేళ వానవస్తే దానికి వినియోగించే కాలంలో, వరండాలో ఈ చివరనుండి, ఆ చివర వరకు వడివడిగా పచారుచేసేవారు. ప్రొద్దుట షికారైన పిమ్మట, ఒంటికి నూనె మర్దన చేయించుకొని స్నానం చేసే వారు. తదుపరి ఉడికించిన కాయగూరలు. పళ్లు, పాలు (అప్పుడప్పుడు కొంచెం అట్టుముక్కలుకూడా ఉండేవి)- వీటితో ఉదయపు భోజన మయ్యేది.

కాలాన్ని సద్వినియోగంచేయడం గాంధిజీకి అలవాటు. అందుచేత స్నానానికి ముందు ఒళ్లు మర్దన జరుగుతూన్నప్పుడు కూడ ఆయనచేత పుస్తకంపట్టుకొని చదువుకొనేవారు. ఉదయం భోజనం ఆరగించేవేళకూడ ఉత్తరాలు చదివించుకొనేవారు. ఈ ఉత్తరా లనేకరకాలు! అవి చాలామట్టుకు, ఆయన సల హానో, ఆశీర్వాదాన్నో అర్థించేవే. ఒకనాడాయన దీవనల నపేక్షించేవారి సఖ్య ఎక్కువై నేను కొంచెం విసుగుచెందగా వారదిచూచి, "ప్రజలంటే నీకు చిరాకుగా ఉన్నట్లున్నది" అన్నారు. దానికి నా కారణం వివరించగా, ఒక కాగితం ముక్క తీసి దానిమీద "వారు ప్రత్యేక సందేశాలేమీ ఈయరు" అని వ్రాసి నాకిచ్చి, దాని ప్రతులను వందలకొలది నన్ను తీయమన్నారు. వారి దీవన లాశించేవారికెల్ల ఒక్కొక్క

ప్రతిని పంపితే, వారు వారు చేసిన పనులు మంచివో చెడ్డవో వారే చూచుకొంటారన్నారు! ఈ విధంగా గాంధీజీకి హాస్య చతురత చాలా ఉండేది.

ఈ సారస్యలక్షణమే తమకు వెఱ్ఱి ఎత్తకుండా కాపాడుతున్నదని ఆయన అంటూ ఉండేవారు ఉత్తరాలంటే జ్ఞాపకం వచ్చింది: ఒకప్పుడొకయువకుడు తన పెండ్లిగురించి సాయపడవలసినదిగా ఉత్తరం వ్రాశాడు. దీనిలోని రహస్యం ఇతడు కోరే సంబంధానికి తండ్రి ఒప్పుకోవడంలేదు. అందుకోసం, గాంధీజీని కాస్త అడ్డుపడమని, ఆతని విజ్ఞప్తి. ఈ రకం విజ్ఞప్తిచూస్తే నాకు కొంచెం నవ్వే పుట్టింది. మామూలు పరిస్థితులలో ఇలాంటి ఉత్తరం గాంధీజీ కివ్వకపోయేవాడినే. ప్రత్యేకించి ఆ రోజుకి గాంధీజీ కొంచెం వ్యగ్రంగా ఉండడంవల్ల, ఈ ఉత్తరం ఆయనకు కులాసా ఇస్తుందేమోనని ఊహించి, ఆయన భోజనం చేస్తూండగా ఆ లేఖ చదువ నారంభించాను. అంత వరకు కిమ్మనకుండా దీక్షగా వింటూ, "మమ్మల్ని కలిపితిరా, సుఖంగా నిలబడగల్గుతాం" అని ఆ యువకుడు వ్రాసిన ఒక వాక్యం వచ్చేసరికి, - గాంధీజీ చటుక్కున, "ఆ తర్వాత ఏమి వ్రాశాడు! 'విడదీస్తిరా, పడిపోతాం' అన్నాడా?" అని పరిహాసించేరు. ఎలాగైతేనేమి, ఆ ఉత్తరం చిగురుదాకా చదివి పారవేయబోయేను కాని ఆయన దానికోసం చెయ్యిజాపేరు. ఆ సాయంత్రం ఆయన సొంత దస్తూరిలో ఉన్న ఉత్తరాలకట్టలో ఆ యువ ప్రేమికునికి వ్రాసిన ఉత్తరం కూడా ఉంది! దానిలో, - తన తండ్రితో ఏకీభవించనప్పుడు అతనిపంచ నుండకుండా వేరే బ్రతుకవలసిందిగా, ఆ యువ

కుడికి గాంధిజీ సలహా ఇచ్చారు అథమపక్షం రెండేండ్లు కూలి పని చేసికొని బ్రతుకుమన్నారు. ఆ లేఖ చివర, - ఈ పరీక్షకు నీ ప్రేమ నిలబడితే నీకు నా సేవనలన్నీ లభింపగల"వని వ్రాస రారు.

దర్మిలాను, "అసలా ఉత్తరానికి జవాబెందుకండీ వ్రాయడం"- అని నేను ప్రశ్నింపగా,- "ఈ యువకుడి కేమి చెప్పనయ్యా ? దేశంకోసం జీవిత ముంకితం చేసికోమందునా ? అతగాడికి నచ్చదు; జీవితారణ్యంలో దారి తప్పాడు; అందు చేత అతనికి దారి చూపడానికి కొద్దినిముషాలపాటు నేను ఖర్చుపెట్టగల్గితే,- పాపం!,- అదొక్కటే ఆ యువకుడికి నేను చేయగల సాయము!" అని ఆయన సమాధాన మిచ్చారు.

ఆవిధంగా వ్యక్తికోసం ఆయన పడే ఆ తాపత్రయమే, గాంధిజీని దేశమంతటా వేలాది ప్రజలకు ప్రియతమునిగా చేసినది. ఎంత గొప్ప త్యాగం చెయ్యమని ఆయన అడిగినా, అందుచేతనే ప్రజానీకం ఆయన ప్రేమఋణం తీర్చుకోడానికి తటాలున లేచి నడుముకట్టుకొని నిల్చునేది. గాంధిజీకేమాన వుని బాధైనా, కొంచెపాటిది కాదు. మే మాయనతో ఉండగా, అట్టి సంఘటన లెన్నో తరచుగా సంభవించేవి. అత్యావసర రాజకీయ సమస్యలెన్నో తలమున్కలుగా ఉన్నప్పుడు కూడ, ఎన్నోసారులు, స్త్రీ పురుషులు వ్యక్తిగతమైన ఆయన సలహాకోసం వచ్చేవారు. కాని జాతి మొత్తం గూర్చి ఆయన యెంతగా తాపత్రయ పడేవారో, అంతగానూ సామాన్య వ్యక్తుల కష్టాలను గూర్చి కూడ పట్టించుకునేవారు. ఉత్తర

ప్రత్యుత్తరాల విషయంలో ఆయన చేసిన ఒక నిబంధన,- వచ్చిన క్రమంలోనే వాటిని పంపాలని. ఎంత ప్రముఖుని దగ్గరనుండి వచ్చినదైనాసరే, ముందుగా వచ్చిన సామాన్య మానవుని ఉత్తరంకంటె ముందు చూడడానికి వీలులేదు.

వ్యక్తులను గూర్చిన తాపత్రయం, గాంధిజీకి ఒకొక్కప్పుడు మరీ తీవ్రంగా ఉండేది. నన్ను గూర్చిన ఒక సంఘటన చెప్తాను క్షమించండి; ఒకప్పుడు నవకాళీలో మేమున్నప్పుడు, నేను చిక్కిపోవడం చూచి, సరిగ్గా భోజనం చెయ్యడం లేదని గ్రహించి, "ఏమిటి కథ ?" అని అడిగారు. "నేను శాకాహారిని కాను, సహచరులందరూ శాకాహారులైనప్పుడు వారి ఎదుట చేపలను తినడ మిష్టములేదని చెప్పాను. అయితే వారితో భుజింపక యజమానితో సాపడమని హితము పల్కారు. కాని ఆ పని మర్యాదగా ఉండదని నేను నిరాకరణ చూపేను. నా ప్రక్కనున్న ఒక పెద్దమనిషి, గాంధిజీయే నన్ను చేపలను తినుమని ఉద్బోధించడం చూచి ఆశ్చర్యపడ్డారు. "దీనిలో తప్పేమి ఉన్నది ? తూర్పు బంగాళమంతా జలమయం; ఇక్కడ చేపలు, వరి, సమృద్ధిగా పెరుగుతాయి. అందుచేత చేపలను తినడంలో తప్పేమి?" అని ఆయన అన్నారు. "అయితే, అది జీవహింస కాదా?" అని ప్రశ్నించారా పెద్దమనిషి. "అవును నిజమే! కాని ఆహార పదార్థాలను కల్తీ చేయడంకంటె, ఇది తక్కువ జీవహింసకదా!" అన్నారు గాంధిజీ.

వ్యక్తులంటే ఇంత మమత్వము, సామాన్య మానవుల మీద ఇంత ప్రగాఢప్రేమ, ఔదార్యం ఉన్నప్పటికి, గాంధిజీ

ప్రవృత్తిలో ఇంకొక విశేషం ఉన్నది: అది మీకు స్పష్టంగా తెలియచేయడానికి రెండు సంఘటనలు చెప్తాను. ఒకప్పుడు నవకాళీలో ఒకయింటి దగ్గరనుంచి వెడుతున్నాం. దుండగులు ఆ ఇంటిని దోచి, ఇంటో మగవాళ్లను చంపివేశారు. ఆడ వాళ్ళందరూ వేరే బసలో తలదాచుకొన్నారు. గాంధిజీ, తమ పర్యటనలో తమ గ్రామం మీదుగా వెడతారని తెలిసి, వారు తమ కూలిన పాతయింటివద్ద వేచే, ఆయన ముంగిలిలోకి వచ్చే సరికి, నమస్కరించారు. ఆయన పాదాలకు భక్తితో మ్రొక్కారు. కళ్లనీళ్లు గ్రుక్కుకుంటూ వారాయనతో, ఏదో బెంగాళీలో తమగోడు వెళ్లబోసికొన్నారు. జరిగినదేమో నేనాయనకు విశదపరచి, ఆ దీనురాండ్రు ఆయన నోటినుండి ఉపశమనవాక్కు లాశిస్తున్నారనే టప్పటికి ఆయన హఠాత్తుగా ఎర్రబారిన మొగంతో "నేనిక్కడికి వచ్చింది ధైర్యాన్ని ఇవ్వ డానికి ఓదార్పు మాటలాడడానికి గాదని ఈ సోదరులతో చెప్పు. ధైర్యం లేకపోతే భారతదేశం సురక్షితం గానేర" దన్నారు

1947 అగస్టులో కలకత్తాలోని 'బెలియా ఘట' యందొక యింట్లో గాంధీజీ బసచేసి ఉండగా, యిలాంటిదే మరొక సంఘటన జరిగింది. వివిధ వృత్తులకు చెందిన ముస్లిముల కునికిపట్టయిన మియాబాగన్-బస్తీ అనే ఒక మురికిపేట ఉంది. యుద్ధానంతరం తాము తస్కరించిన నాటు బాంబుల తోను, తుపాకులతోను, హిందూ యువకులు ఆ ముస్లిములను బెదరించి, ఆ పేటనుంచి వారి నందరిని తరిమివేశారు. శాంది శీకులైన ఆ ముస్లిముల నందరిని వెనుకకు తీసికొనిరమ్మని ఆ

యువకులకు నచ్చచెప్పాలని, గాంధీజీ అచ్చటికి వేంచేశారు. ఏమీ భేదబుద్ధి వహింపక, వారి నందరిని సామాన్య భారత పౌరులుగా చూడాలని, అట్లందరు కలిసి మెలిసి భారత గౌరవాన్ని నెలకొల్పాలని ఆయన మందలించగానే చాలామంది నల్ల జెండాలతోనూ, "తిరిగి పొమ్మని నినాదాలు వ్రాసిన అట్టలతోనూ" ఆయనకు వ్యతిరేకంగా ప్రదర్శన జరిపారు. అయితే గాంధిజీమాత్రం వారితో ఓపికగా 5, 6 గంటలసేపు వాదించి, అధమపక్షం కూలిజనాన్నైనా మళ్ళీ తీసికొనివచ్చి, ఆ ముస్లిం పేటలో పునరావాసం కల్పించాలని నచ్చచెప్పారు. ఆయన కోరిక ప్రకారమే జరిగింది.

మరొక పక్షం రోజులలో మళ్ళీ హిందూ - ముస్లిం ద్వేషాలు కలకత్తాలో చెలరేగాయి. బహుశః కాంగ్రెసు గవర్నమెంటు అధికారంలోనికి వచ్చింది కనుక, ఇన్నాళ్లు పాకీస్తాన్ కొఱకు పనిచేస్తున్న ముస్లిములను దండిస్తే వారికి దిక్కూ మొక్కూ ఉండబోదని కాబోలు, - హిందువులు పైచెయ్యిగా ముస్లిములపైన దౌర్జన్యానికి ఒడికట్టారు. దురదృష్ట వశాత్తు 1947 ఆగస్టు నెలాఖరున, మళ్లీ మత విప్లవాలు పట్టణ సమీపంలో విజృంభించాయి. అచ్చటికి పునరావాసం వచ్చిన ముస్లిములు ధైర్యం గోల్పోయి, ఒక మైలు దూరంలో తమ వారి జనాభా ఎక్కువగా ఉన్న రాజా బజారునకు తమ్ము తిరిగి పోనిమ్మని గాంధిజీని ప్రార్థించారు. అందులకాయన సమ్మతించారు; ఒక ట్రక్కులో నలుబది మందిని తీసికొని పోవుచుండగా, ఎవరో రెండు చేతిబాంబులు విసిరారు - ఇరువురు వెంటనే మరణించారు. ఆ మరణించినవారిలో ఒకని తల్లి

రక్తసిక్తాంబరాలతో ఉన్న కొడుకు శవం ప్రక్కన కూర్చుంది. గాంధిజీ ఆ బీభత్సంచూస్తూ అట్లా వెడుతూండగా, ఆ తల్లి ఘోరున రోదింపసాగింది. అప్పుడాయన నాతో నెమ్మదిగా "ఆ బిడ్డ నివ్వడం, మళ్ళీ అట్లా తీసికోవడంకూడ దైవలీల; దానిని కాదనడానికి మనకేమి హక్కువుంది. అని ఆమెకు నచ్చచెప్పు"మని ఆదేశించారు. ఆ దీనురాలితో అట్లు చెప్ప డానికి నాకు సాధ్యంకాదని నా అశక్తి ప్రకటించాను.

గాంధిజీ తిరిగివచ్చిన తరువాత వందగజాల దూరంలో ఉన్న కొందరు యువకుల దగ్గరకు నేను పోయి గాంధిజీకి వారు చేసిన వాగ్దానం భంగం చేశారని మందలించాను. వారందులకు వారి సంతాపం వెలిబుచ్చారు; వారిలో యిద్దరు యువకుల కానాడు గాంధిజీ మాటలు నచ్చక పోవుటవల్ల ఈ దుస్సంఘటన సంభవించిన దన్నారు కాని వారిదొక మనవి ఉన్నదన్నారు. బస్తీలో ఇంకా కొంతమంది ముస్లిములు మిగిలి పోయారు; వారిని పోనీయకుండా నిలిపి తమ వాగ్దానాన్ని నిలబెట్టుకొంటా మన్నారు ఐతే దౌర్జన్య రహితంగా వారి నెట్లు రక్షించుటో తమకు తెలియుట లేదనీ స్టెన్ తుపాకులతో వారిని రక్షించి తమవాగ్దానం నిలుపుకొంటామనీ, లైసెన్సులేని తుపాకు లుపయోగించారన్న కారణంచే పోలీసులు వారిని నిర్బంధించేయెడల మాత్రము గాంధిజీ తమను విడుదల చేయిం చాలనీ వారు కోరారు.

ఇది వింతకోర్కె: అయినా, ప్రక్కనే తోటలో పచారు చేయుచున్న గాంధిజీ కా యువకుల కోర్కెను విన్న

వించాను. విని వినడంతోనే "సరే నేను వారికోర్కె కంగీకరించాను" అని ఆ యువకులకు చెప్పమన్నారు. దర్శిలాను సాయంత్రం వారెందుల కట్లు అహింసాసిద్ధాంతానికి విరుద్ధంగా ఒప్పుకొన్నారో చెప్పవలసినదని కోరగా "వా రహింసా పిధాన మందు విశ్వాసం లేనివారై ఉంటూ, వారికోర్కె ధర్మయుతం కాగా, తన నైతిక సాహాయ్య మిస్తానన్నారు. కాని, ఇది అహింసయందలి నా విశ్వాసమున కొక సవాలు!" అన్నారు. "హింసకంటె అహింసయే ఎక్కువ రక్షణ నిస్తుందని నేను నిదర్శనంగా ఋజువుచేస్తే తప్ప, అహింసాతత్త్వ మెరుగనివారి కెట్లు నచ్చచెప్పగల" నన్నారు.

కలకత్తా ప్రజలు తిరిగి వ్యస్థచిత్తులు కావలెనని త్రాణామరణ ప్రాయోపవేశ దీక్ష ప్రారంభించారు. అదృష్టవశాత్తు డెబ్బది రెండు గంటలు గడచిన వెంటనే, ఆయన ప్రతిజ్ఞ కలకత్తా ప్రజల హృదయాలను మెత్తబరచింది. పలుచోట్ల ప్రజలనేకులు ఈ దౌర్జన్యకాండల నరికట్టెద మని నడుములు కట్టుకొని ముందంజ వేశారు. హింసాకాండలో ఎక్కువగా పాల్గొన్నవారుకూడా కొందరు తమ బాంబులను తుపాకులను గాంధిజీ పాదాలవద్ద పడవేశారు.

కొంతకాలము పిమ్మట గాంధిజీతో ఈ విషయం గూర్చి నేను ప్రస్తావింపగా, అహింసా ప్రభావం అట్లా ఉంటుందని వారు విశదీకరించారు. మంచితనం సాధారణంగా మందగమనం వహిస్తుంది. కాని సామాన్య ప్రజలను ప్రేమించే ఒకవ్యక్తి, వారి అలసత వలన నొప్పింపబడి, వారు తమ స్వభావమును

మార్చుకొనిన తప్ప తాను ప్రాణత్యాగము చేస్తానంటే వారు వారి అలసతను విడనాడి చేయవలసిన కార్యమును చక్కగా చేస్తారు. ఇట్టి ఉపవాసదీక్ష కేవల దుర్మార్గుల కర్కశ హృదయాలను మార్చగలదన్న విశ్వాసము గాంధిజీ కెంతమాత్ర మున్నూ లేదు, కాని, అట్టి దుష్టులకు ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని మద్దత్తు నిచ్చుచున్న వ్యక్తులను, వారినుండి విడదీసి వేసిన యెడల (పై సంఘటనలో వలె) అహింసా విజయము సుసాధ్య మగును. మంచికి శక్తి చేకూరి స్తే చెడుగు నిస్సహాయ మై పోతుంది.

ఇటువంటి సంఘటనలతోనే గాంధిజీ ఎంత ఉన్నత స్థాయికి లేవగలరో మనము గ్రహించగల్గుతాము. మట్టిలోంచి మహావీరులను సృష్టించగల నిరుపమాన ప్రతిభ గాంధిజీకే కల దని- ఒకప్పుడు గోఖలే ప్రశంసించారు. తా మందుకోవాలని ఆశించిన ఒక ఉన్నతస్థాయి అయనలో గలదని ప్రజలు పసిగట్ట గలిగారు. తమలో చేరిపోయి తమవెంట ఆ మహోన్నత వ్యక్తి నిలవడమే బహుశః వారికి ప్రోత్సాహాన్ని కలిగించింది.

# II

# సత్యాగ్రహము, సమరము

గాంధిజీ వ్యక్తిత్వాన్ని చిత్రించడానికి నిన్న ప్రయత్నించాను. ఆయన తన ప్రేమవలన చుట్టునున్న ప్రజలకెంతో సన్నిహితంగా ఉండగలిగారనీ, అసాధారణ మేధాధీరత్వాలవల్ల వారికి అతీతుడుగా పరిగణింపబడేవారనీ నిరూపించడానికి ప్రయత్నించాను. విశ్వాసాలుగల ప్రజలతో ఆయన ఎట్లు వర్తించినదీ సూచించడానికికూడా ప్రయత్నించాను. అయితే విశ్వాసాలంటే విభిన్న మతాలని కాదు నా అభిప్రాయం. భిన్న భిన్న విశ్వాసాలని మాత్రమే! మాటవరుసకు - తన వృత్తిలో ఒక కళాకారుని విశ్వాసం, తానొక ధర్మ పరిరక్షణ కొరకు ఆయుధధారణ చేశానన్న ఒక యోధుని విశ్వాసం. మళ్లీ, సత్యమునుగూర్చి ప్రత్యేక దృక్పథంలో ఒక నాస్తికునికున్న విశ్వాసం - ఆయా విశ్వాసాలకు వారు కట్టుబడి ఉంటే, గాంధిజీ వారిని గౌరవించారు. తనకున్నూ వారికిన్ని ఏవో కొన్నైనా సామ్యవిషయాలు మాత్రముంటే, అట్టి భిన్న ప్రవృత్తులు గలవారితో కలిసి మెలిసి పనిచేయడం గాంధిజీకి ఏమంత కష్టమనిపించలేదు.

పరిష్కారార్థము గాంధిజీ నెత్తిమీద వేసికొన్న సమస్య లన్నిటిలో యుద్ధము ముఖ్యాతిముఖ్య సమస్య. సాంఘిక వ్యవస్థలో పరిణామాన్ని సాధించడానికి యుద్ధం పటుతర సాధనమన్న సంగతి ఆయన ఎరుగుదురు. కాని యుద్ధ ఫలితాలు, యుద్ధమాసించిన లక్ష్యాలకంటె భిన్నంగా ఉంటాయని కూడా ఆయన ఎరుగుదురు. అదిన్నీకాక, యుద్ధమన్నది విపరీత వ్యయ విధ్వంసములతో కూడిన దగుటచేత, మానవులు తమ తమ వివాదాలను శాశ్వతంగాను, చౌకగాను పరిష్కరించుకునే మార్గం కనిపెట్టాలని గాంధిజీ ప్రయత్నించారు. మంచి మార్గమన్నది, మనుష్యులను యుద్ధాత్పూర్వంకంటె యుద్ధాత్పరం అధిక దుస్థితిలో పెట్టకూడదు. యుద్ధం బదులు ఒక నైతికవిధం అన్వేషించి ప్రవేశపెట్టకపోతే, ఏదో ఒకనాడు మొత్తం ప్రపంచ నాశనానికే దారి తీయగలదని ఆయన ప్రగాఢ విశ్వాసం.

దౌర్జన్యవిధానంవల్ల, ఒకవేళ భారతదేశం బ్రిటిషువారి నుండి స్వాతంత్ర్యాన్ని గడించినా, దేశ పాలన, సమస్త ప్రజల హస్తగతమై ఉండక, అల్పసంఖ్యాకుల అధీనం కాగలదని, గాంధిజీ దృఢంగా విశ్వసించారు. అట్టి అల్పసంఖ్యాక పాలక వర్గం నీతిమంతులే కావచ్చును; బ్రిటిషువారు వైదొలగిన పిమ్మట, పాలనాధికారాన్ని సామాన్య ప్రజలతో పంచుకోవాలనే సదభిప్రాయంకూడా వారు కల్గియుండవచ్చును; కాని, వేలాది వర్షములు పరాధీనతకూ, సాంఘిక విచ్ఛిత్తికిన్నీ పాలైన మన దేశంలో సంఘమింకను సుస్థిరరూపము పొందక మునుపే, అధికారము సామాన్యప్రజాయత్తముకాక, దౌర్జన్య

కాండ నడపి రాజకీయపదవు లలంకరించిన అల్పసంఖ్యాకుల చేతులలోనే నిలిచిపోయే ప్రమాదం ఉన్నది.

ఆయన 1909 లో "హిందు స్వరాజ్" లేక "ఇండియన్-హోంరూల్" అను పేరుగల ఒక చిన్న పుస్తకం వ్రాసిఉన్నారు. దానిలో గాంధిజీకిన్నీ ఒక విప్లవకారునకున్నూ ఊహా సంభాషణ నడచింది : అందులో తానిచ్చిన ఒక జవాబులో - భారత దేశమును, ఒక్క బ్రిటిషువారి అధికారము నుండి మాత్రమేకాక, తక్కిన అన్నిరకముల అక్రమాధికారాల నుండిన్నీ విముక్తము చేయాలన్న తమ ఆత్రమును గాంధిజీ వ్యక్తపరచారు. భారత దేశములోని ఎన్నో భాగాలు సంస్థానాధీశుల పాలనలో ఉన్నాయి. బ్రిటిషువారి అధీసంలో ఉన్న భాగాలకంటె, ఇవి ఏవిధంగానూ బాగుగా లేవు. ఆయన మతంలో 'స్వాతంత్ర్యం' అంటె విశృంఖలమైన సర్వతోముఖ స్వాతంత్ర్యం. దుష్ప్రయుక్తమైన అధికారాన్ని సామాన్య ప్రజలు ప్రతిఘటింప గలిగినప్పుడే వారికి నిజమైనస్వాతంత్ర్యం ఉన్నదన్నమాట. అట్టి స్వాతంత్ర్యం దౌర్జన్యరహిత విధానం వల్లనే సాధ్యం కాగలదని గాంధిజీ విశ్వాసం.

సోక్రటీసు, ఏసుక్రీస్తువంటి మహనీయులకే 'స్వతంత్రు' లన్న శబ్ద మెంతైనా తగునని సువిదితమే. వారి ఆత్మవిశ్వాసం అచంచలం; దాన్ని చెదరగొట్టడ మెవరితరమూ కాదు. తమ విశ్వాసంకోసం చివరకు వారు ప్రాణత్యాగం కూడా చేశారు. అట్టి స్వాతంత్ర్యమే వాంఛనీయం, కాని, అది అధిక ప్రజానీకానికి సులభసాధ్యమైనది కాదు. అటువంటి సంపూర్ణ ప్రజ్ఞా

వంతులైన స్త్రీ పురుషులతో కూడిన సంస్థ మనకుంటేనే ప్రపంచ స్వరూపాన్ని మార్చగలమని కూడా గాంధిజీ అనుకో లేదు. అందుచేతనే యథాతథంగా, ఇప్పుడున్న స్త్రీ పురుషుల తోనే ఒక సంస్థ నిర్మించాలని ఆయన ప్రయత్నించారు. వారంతా కలిసిమెలిసి కావలసిన రీతిగా ప్రవర్తించి, సామూహిక శక్తితో ఇతోధిక స్వాతంత్ర్య ముఖులై పురోగమింప వలెనని ఆయన ప్రణాళిక. అంతటి అచంచలమైన విశ్వాస మున్న వ్యక్తులుంటేనే సత్యాగ్రహ సమరాన్ని నడిపించవచ్చు నని కొందరు శాంతిపరుల నిశ్చితాభిప్రాయం. కానీ, గాంధిజీ అంతటి కార్య నిష్ఠలేని మనుష్యులతోనే అట్టి సమరాన్ని ప్రారంభించారు. కార్యాచరణకు కొన్ని నిబంధనలను రూపొందించారు. తాము పోరాడే విధంలో ప్రకృష్టంగా ఉండాలన్న ప్రయత్నంవల్లనే, తాము నివసించే పరిసర వాతావరణంలో ఒక విప్లవాత్మకమైన మార్పును తీసికొని రాగలుగుతారని, ఆయన ఆశించారు. యుద్ధ విముఖులైన తదితరుల విధమున కున్నూ, గాంధేయ విధమునకున్నూ ఇదే గొప్ప భేదము. ఈ భేదాన్ని ఎల్లప్పుడు మనము మనస్సునం దుంచుకోవడం చాలా అవసరం కూడా! తన మనస్తత్వం గల మనుష్యులతో తానొక సంస్థ నిర్మించుకోగలరు కదా! అట్టిపని చేయక, తన రాజకీయ ప్రణాళికలను నెంతసేపూ భారత జాతీయ కాంగ్రెసు ద్వారానే నిర్వహించే ప్రయత్నం చేస్తారేలనో అని, ఒకప్పు డొక విలేఖరి గాంధిజీని ప్రశ్నించారు. ఆయనకు కాంగ్రెసుతో ఉన్న సంబంధం 'అది సామూహిక దౌర్జన్యరాహిత్య విధానాన్ని' అమలు పరచడానికి తోడ్పడిందని ఆయన సమాధాన

మిచ్చారు. అటుగాక దౌర్జన్యరాహిత్యాన్ని ఒక మత విశ్వాసంగా నమ్మినవారిని మాత్రమే చేరదీయాలని కూర్చుంటే, ఆ ఉద్యమం ఆయనతోనే నిలిచిపోవచ్చు నన్నారు. ఇంచుమించు తనలాంటి వారితో ఇట్లుగా పయనించాలి గాని, ఒంటరిగా పోగూడ దన్నది మరీ ముఖ్యమైన సంగతి.

ఈ సందర్భంలో - రాజకీయ స్వాతంత్ర్యానికి, ఆర్థిక స్వాతంత్ర్యానికీ గల సన్నిహిత సంబంధాన్ని గ్రహించడం చాలా అవసరం. ఆర్థిక స్వాతంత్ర్యం పునాదులపైనమాత్రమే రాజకీయస్వాతంత్ర్యం నిర్మింపగలమని గాంధిజీ దృఢవిశ్వాసం. ఆర్థిక జీవితం కేంద్ర హస్తగతమైనట్టి నిరంకుశ పాలనా వ్యవస్థలో కేంద్రాధికారుల నిర్ణయాలు తమకిష్టం లేనివైనా తమరి నెక్కడ అణచివేస్తారోనన్న భయంచేత, సామాన్య ప్రజలు ప్రభుత్వాన్ని ప్రతిఘటించడానికి గొంతెత్తనేరరు. వస్తూత్పత్తి సంస్థల వికేంద్రీకరణము మూలమున ఆర్థిక స్వాతంత్ర్యం లభ్యం కావలెనని గాంధిజీ పట్టు పట్టడాని కిదే ప్రధాన కారణము. భయంవల్ల ప్రభుత్వ విధానాలను శిరసా వహించే దౌర్భాగ్యస్థితి తొలగిననాడు ప్రజలు తమ విశ్వాసాలను పూర్తి స్వేచ్ఛతో ఆదరించగలరు. ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధి చేయడాని కది చక్కని రాజమార్గం.

గాంధిజీ నిర్మాణ కార్యక్రమంలో రాట్నానికి ముఖ్య స్థానం లభించింది. భారతదేశంలో బట్ట కొరత, నిరుద్యోగ సమస్యకూడ కొంతమట్టుకు పరిష్కృత మగుటకు గాను, జాతిలోని ప్రతీ వ్యక్తికూడా తన విరామకాలం సద్వినియోగం

చేయాలని ఆయన కోరారు. మన దేశంలో ఇచ్ఛాపూర్వక మైన సహకారం లక్ష్యం కావడానికి ఖాదీ సంస్థ ఒక ముఖ్య సాధనమనీ గాంధిజీ విశ్వసించారు. బహు సంఖ్యాకుల కష్ట ఫలితంగా అల్పసంఖ్యాకులు శ్రీమంతులయ్యేటట్లు ఉత్పత్తి వృద్ధిచేసేవే యంత్రాలున్నా, పరిశ్రమ సంస్థలున్నా అయితే, గాంధిజీ వానిని ఆమోదించలేదు. అటుగాక, కోట్లాది స్త్రీ పురుషుల శ్రమను తగ్గించుటకుగాను యంత్రాదికాన్ని ఉప యోగించే యెడల, వారు వాటి ఉపయోగాన్ని ఆమోదించే వారు.

ఉత్పత్తియొక్క వికేంద్రీకరణ పద్ధతిని విస్తారంగా వర్ణిం చక, యుద్ధానికి ప్రత్యామ్నాయముగా గాంధిజీ పన్నిన 'సత్యాగ్రహ' సంస్థనుగూర్చి ముచ్చటిస్తాను. వికేంద్రీకరణము నందాసక్తి గలవారు పీటరు క్రోపాట్కిన్ రచనలను, ముఖ్యంగా "ఆహార విజయము", "పొలములు, యంత్రాగార ములు, కర్మాగారములు", "విప్లవకారునిగా నా జీవితము" - అను రచనలను చదవడం మంచిది.

దక్షిణాఫ్రికాలో, గాంధిజీ శాంతియుత ప్రతిఘటనను ప్రవేశపెట్టినప్పుడు దానిని 'శాంతియుత ప్రతిఘటన' (Passive Resisstance) అని మాత్రమే అనేవారు. అయితే అది కేవలము శాంతియుతను మాత్రము గాదని ఋజువైనది. అందుచేత ఆ పేరు విడిచి "సత్యాగ్రహము" అనే పేరును సృష్టించారు. 'సత్యాగ్రహము'నకు 'సత్యము'నందు 'ఆగ్ర హము-నిష్ఠ' అని శబ్దార్థము; వివరిస్తే, తాను సత్యమని నమ్మిన

సిద్ధాంతముపై ఒక వ్యక్తికిగల తీవ్రమైన పట్టుదల అను అర్థము స్ఫురిస్తుంది.

సత్యాగ్రహానికీ, యుద్ధానికీ రెండు సమాన ధర్మాలున్నాయి. ఈ రెండింటిలోనూ మొదటి ఎత్తునువేసే అవకాశాన్ని యోధుడు తన చేతిలోనే ఉంచుకోవడానికి ప్రయత్నిస్తాడు. రాజీకిగాని, పరిష్కారానికిగాని ఇతర మార్గాలేవీ ఫలించవని గ్రహించినపుడే యోధుడైనా, సత్యాగ్రహియైనా తన కడపటి సాధనంగా ప్రతిఘటన కుద్యమిస్తాడు. రెండున్నూ ప్రత్యక్ష క్రియాత్మకము లగుటచేత, ఈ విషయంలో రెంటికిన్నీ సామ్యముంది.

కాని ఒక్క సందర్భంలో మాత్రం రెంటికిన్నీ గొప్ప భేదమున్నది: హాల్డేను అనే తత్త్వవేత్త యుద్ధమంటే ఒక జాతి తన ఇచ్ఛను, శిక్షాపూర్వకంగా ఇంకొక జాతిమీద రుద్దడమే నని నిర్వచించాడు. ప్రతికక్షిని యుద్ధతంత్రానికిగాని, ఆర్థిక, రాజకీయ నిర్బంధాలకుగాని అనేక విధాలుగా గురి చేయవచ్చును. సత్యాగ్రహి, అట్లుగాక, తన ప్రతికక్షితో సహాయ నిరాకరణమువల్ల, వాని దుర్మార్గము నొక్కిపెట్టుగా మట్టుపెడతాడు. ఆ సహాయనిరాకరణ విధానంలో తాను ధైర్యస్థైర్యాలతో నిలిచి, తన ప్రతికక్షి పెట్టే ఎంత శిక్షనైనా భరిస్తాడు. తన ప్రతికక్షిని ఏవిధమైన ఆర్థిక బహిష్కృతిన్నీ పాలుచేయడమే కాక, నైతికమైన ఒత్తిడికి మాత్రం పాలుచేయడమే సత్యాగ్రహి లక్ష్యం. తన నిశితవిధానంలో దృఢంగా ఉండుటవల్ల శత్రువుకు అతడు గౌరవపాత్రుడవుతాడు. ఇట్టి

పరిస్థితులలో శత్రువే రాజీ సన్నాహం ప్రారంభించడం కద్దు. ఒక నిర్ణీత పరిష్కార సాధనమే సత్యాగ్రహి పరమలక్ష్యం. ఆదర్శయుతంగా సాగించిన సత్యాగ్రహ సమరానికి విజయం గాని, పరాజయంగాని ఉండదు. ఏమంటే, – ప్రాథమిక సూత్రాలను విస్మరించకుండా ఉభయవర్గాలు న్యాయసమ్మత మైన ఒక నిర్ణయానికి వచ్చితీరాలి.

సర్వమానవ సమైక్యతలో గాంధిజీకి చాలా విశ్వాసం జాతి సమిష్టి శ్రేయస్సే వ్యక్తి శ్రేయోభివృద్ధికి కారకమని ఆయన సిద్ధాంతం. గౌరవమార్గంతో, సత్యానికి సంబంధించిన తమ తమ పాక్షిక దృక్కులను సుసంహరించుకోవడానికి ఇరు పక్షాలవారు సిద్ధపడితే, ఏదో ఒక పక్షానికే శ్రేయము లభించుట గాక, కడపటికి మానవ జాతి సంశ్రేయోభివృద్ధికే దోహదంగా వారి నిర్ణయం నిగ్గు తేరగలదు.

సాధారణంగా ధర్మమున్న పక్షానికే యుద్ధంలో విజయం సిద్ధిస్తుందని తరుచు చెప్పడం కద్దు. "యతోధర్మ స్తతోజయః" అన్న సూక్తి కర్థమిదే. కాని నేటి ప్రపంచంలో ఒక రాజ్యాని కున్న ఆయుధ శక్తికీ, దాని ధార్మిక శక్తికీ సంబంధం లేక పోవడం మనం చూస్తున్నాము. రష్యాకున్నా, అమెరికా సంయుక్త రాష్ట్రాలకున్నా దారుణ మారణాయుధ సంపత్తు లున్నాయి. ఒండొంటి కాయుధ సంఘర్షణమే సంభవిస్తే పర్యవసాన మెట్లుండునో ఎవ్వరూ చెప్పజాలరు కాని వారి ఆర్థిక విధానాలకున్నూ, ఆయుధ బలానికిన్ని పోలికయేమీ లేదన్నది అందరికీ విదితమే.

ఇదే యుద్ధానికి గల ముఖ్యలోపమని గాంధిజీ భావించారు. సత్యాగ్రహాం దట్టుగాక, ఇరుపక్షాల వారు సంప్రతింపులవల్ల యేదో ఒక సమాధానాంగీకారానికి రావలసి ఉంది. సత్యాగ్రహి కెంత ఎక్కువ ధైర్యం ఉంటే అంత శీఘ్రంగా ఫలితాలు లభిస్తాయి. ఈవిధంగా, నైతికంగా యుద్ధంకంటె సత్యాగ్రహం గొప్పది.

కాని మానవ స్వభావాన్ని బట్టి చూస్తే, "సత్యాగ్రహ మసలు సంభావ్యమైన సిద్ధాంతమేనా?" అన్న శంక కలుగవచ్చు. నేటికంటె మానవజాతి అత్యున్నతి పొందక పూర్వమే కనిపెట్టవలసిన ప్రచ్ఛన్న శక్తులు మానవస్వభావంలో ఉన్నవని గాంధిజీ అభిప్రాయము. యుద్ధమందు కూడ, ఏ పక్షం ఎక్కువ త్యాగానికి సిద్ధపడితే, ఆ పక్షం నెగ్గడాని కెక్కువ అవకాశముంటుంది. ఆయుధ సంపత్తి విజయదోహదకారి అన్నమాట వాస్తవమే; కాని యుద్ధంలో ప్రాణత్యాగానికి సంసిద్ధత అనేది, విజయసాధనకు అల్ప విషయ మేమీకాదు. ప్రతియోధుడూ సుశిక్షితుడు కాకమునుపే మృత్యుభయము విడనాడగలడని చరిత్రతోగాని, మానసిక శాస్త్రముతోగాని, పరిచయమున్న వారెవరున్నూ అనజాలరు. కాని ప్రతియోధుడూ అందుకు ప్రయత్నం మాత్రం చేస్తాడు. యుద్ధంలో తన సేనను నడుపడమెట్లో తెలిసిన సేనాని అయితే విజయసాధన కింతమాత్రం చాలు. సత్యాగ్రహ సమర యోధునివల్ల కూడా గాంధిజీ ఇంతకంటె ఏమీ యెక్కువ ఆశింపలేదు. సహాయ నిరాకరణోద్యమంలో ముందుశ్రేణిలోని వారు, ఎట్టి పరిణామమైనా స్వీకరించడానికి సంసిద్ధులైతే వెనుక శ్రేణులలోని అనుయాయా

యులు కూడ, వారెంత సామాన్యులైనా, క్రమశః దిట్టలై, ధీరులై, విజయావహులు కాగలరు. ముందుపంక్తుల వారినిబట్టి వెనుకనున్న స్త్రీలైనా, పురుషులైనా, ధీరులో, భీరులో, అవుతారు. యుద్ధ మందైనా, సత్యాగ్రహ మందైనా, యింతే. గాంధిజీ తన సత్యాగ్రహోద్యమాలను నిర్వహించడంలో ఈ మానవ మనస్తత్త్వం మీదనే ఆధారపడేవారు.

1921 నుండి 1948 వరకు, 1921, 1930, 1932, 1942 సంవత్సరాలలో భారతదేశంలో ముఖ్యంగా నాల్గు రాజకీయోద్యమాలు నడచినవి; ఇవికాక, స్థానికమైనవి ఆర్థిక దుస్థితులను, సాంఘిక దురన్యాయాలను ప్రతిఘటించడానికి సుమారు నలుబది ఉద్యమాలుకూడా సాగినవి. రాజకీయ చరిత్రకు, రణ నైపుణ్యమునకు సంబంధించిన విద్యార్థులు ఈ ఉద్యమాలను పరిశోధించవలసిఉన్నది. నాయకత్వము వహించి కాని, సలహా యిచ్చిగాని గాంధీజీ బాధ్యత వహించిన ఈ ఉద్యమా లన్నిటియందు ఒక ప్రధానలక్షణము ప్రస్ఫుటముగా గోచరిస్తున్నది. సత్యాగ్రహోద్యమంలో ఎప్పుడూ ఒక అనుక్రమమైన ప్రగతి పన్ని ఉంచడం ఆయన పద్ధతి. అదీగాక - ఒక పరిమితమైన కోర్కెలకోసంగాక, విరివియైన రాజకీయోద్యమాలు నడుపవలసి వచ్చినప్పుడు, అప్పటి ఉత్పత్తి విధానం లోని లోపాలను సరిపుచ్చుకొంటూ, సత్యాగ్రహానికి కావలసిన ఆర్థిక పునాది వేయుటకు గాంధిజీ ప్రయత్నించేవారు. ఇవన్నీ సరేసరి - ఉద్యమం ముమ్మరంగా సాగుతూ ఉంటే, అగ్రశ్రేణి వారికి, వెనుకశ్రేణులవారికి, కారణాంతరాలచే ఉద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొలేక కేవలం సానుభూతిపరులై ఉన్నవారికి

కూడ - అన్ని తరహాలవారికి అందిపుచ్చుకోడానికి వీలైన రక రకాల ప్రణాళికలు వన్ని, ఆ పని చేయడాని కందించేవారు.

సామాన్య ప్రజానీకంలో ఇతోధికంగా ధైర్యము కలిగించడానికీన్ని, దౌర్జన్యరాహిత్యరీతులు విడనాడి, మధ్య మధ్య ఆవేశమూలమున దౌర్జన్యంలోకి తన ఫౌజులు జారి పోకుండా ఉండడానికిన్ని, గాంధిజీ ఎన్నిరకాల పన్నికలు పన్ని జాగరూకత వహించేవారో, చరిత్రలో రణనైపుణిగూర్చి పరిశీలనచేసే విద్యార్థులు భారత సత్యాగ్రహోద్యమాల చరిత్ర వల్ల అపారంగా నేర్చుకోగలరు. ఆ అధ్యయనం చాలా సర దాగా ఉంటుందికూడా! రాజకీయ విజ్ఞానశాస్త్రము, చరిత్ర నిశితంగా పఠించే విద్యార్థులు, - ఇంకా తత్సంబంధ గాంధేయ యోధులు బ్రతికి ఉండగానే, వారినుండి ఈ ఉద్యమాలలోని నిగూఢాంశాలు గ్రహించాలని ఆశిస్తున్నాను.

విజయావహములైన ఆ ఉద్యమా లన్నిటిలో కన్పట్టు ప్రథమలక్షణం ఏమిటంటే, సత్యాగ్రహి ఏ లక్ష్యంకోసం పోరు సాగిస్తున్నాడో, అందలి మౌలికమైన నీతి. రెండవది - సత్యా గ్రహం నడిపించుటలోగల సాహసలక్షణం. సత్యాగ్రహ సమర నైపుణ్య విధానంలో సాహసము కావలెననేకాక, దేశకాల పరిస్థితులనుబట్టి తన గమనమందలి శీఘ్ర మందగతుల మార్పు నేర్పుతో చేసికొనుచు, ఉద్యమం సజీవంగా నడిచేలాగున నిగ్రహానుగ్రహ సామర్థ్యాన్ని గాంధిజీ సమయోచితంగా ప్రదర్శించేవారు.

సత్యాగ్రహోద్యమంలో నిమగ్నమైన సమాజమంతటికి అది ఒక ప్రబోధదాయకంగా ఉంటుంది. దానిలో అందరున్నూ పాల్గొనవచ్చు. ప్రత్యక్షంగా సమరం సాగించేవారికి, పరోక్షంగా ఉన్నవారు నైతికశక్తి నుపకరించుటకుగాను, ఆర్థిక, సాంఘిక బలమును చేకూర్చవచ్చు. దౌర్జన్య రాహిత్య పద్ధతివల్ల సర్వవిషయాలు సంరక్షింపబడగలవా? అని ఒకప్పుడు గాంధిజీనొక ప్రశ్న వేశారు. దానికి వారు, దౌర్జన్యరాహిత్యం వల్ల సముపార్జింపగల విషయా లన్నీ రక్షింపబడగలవని సమాధాన మిచ్చారు. హింస వలన సంపాదితములైన సమస్త విషయములను ముందుగా విడనాడి - అహింసవలన రక్షించుకోదగ్గ విషయము లన్నింటిని సక్రమముగా అమర్చుకోవలెను. అప్పుడే అతని అహింసా రక్షణము ప్రయోజనము కాగలదు. వైయక్తికమైన పెట్టుబడిదారీ విధానము సత్యాగ్రహ మాత్రంతో రక్షితము కాజాలదని ఆయనకు విస్పష్టమైన అభిప్రాయముండేది. దౌర్జన్యరహిత సంఘంలో అనేక ప్రయోజనములకు పెట్టుబడి అవసరము. అప్పుడు ప్రభుత్వము సంఘ ప్రయోజనార్థము పెట్టుబడి మొత్తమును సేకరింపవలసి యున్నది

అందుచేత గాంధేయ విధానంతో అప్పటి సాంఘిక వ్యవస్థలోని లోపాలను ప్రతిఘటించడానికి శాంతియుత సహాయ నిరాకరణంతో ప్రారంభమై, ఆ వ్యవస్థను అంతరంగికంగా సంస్కరించే దారులవెంట నడుస్తుంది. గాంధిజీ నిర్మాణ కార్యక్రమం శాంతియుత సహాయ నిరాకరణాని కెంతమాత్రం

తీసిపోని ప్రాముఖ్యం గలది. రెండున్నూ అత్యంత గాఢ సంబంధము కలవి.

ఒకవిధంగా చూస్తే ఇట్లా గాంధీజీ క్రొపోట్కుర్, టాల్స్టాయ్ వంటి అరాజకవాదుల కోవకు దగ్గరగా వస్తాడు. కాని ఆయన వారికంటె కొంచెం భిన్నుడు. ఎందుచేతనంటే, వారివలెగాక ప్రభుత్వం అసలే లేకుండా మానవుడు నిగ్రహించగల డనడానికి, మానవస్వభావ మంత సమగ్రమైనది కాదని ఆయన విశ్వసించారు. ప్రభుత్వ మెంత మంచిదైతే ప్రజల ఐచ్ఛిక సంస్థలతో అది అంతగా జోక్యం కల్పించుకోదు.

ప్రజా ప్రాతినిధ్యంతో ఏర్పడే ప్రభుత్వాన్ని గూర్చి కూడా గాంధిజీకి మౌలికమైన ఊహాలు కొన్ని ఉన్నాయి. నవకాళీలో ఇచ్చిన ఒక ఉపన్యాసంలో ఆయన వోటింగు హక్కుకు అధమ వయః పరిమితి ఉన్నట్లే, అధిక వయః పరిమితి కూడా ఉండాలని సూచించారు. ఆ అధిక పరిమితి 50 ఏండ్లున్న బాగుండునని ఆయన అభిప్రాయం ఆ వయస్సు దాటిన వారు, ప్రభుత్వ నిర్వహణ బాధ్యతగల రాజకీయ సంస్థలలో గాక, ఐచ్ఛిక సంస్థలలో పాల్గొనవచ్చును. అట్టి వ్యక్తి కేవలము సలహాదారుడుగా మాత్రమే పనిచేయవలెను. ఈ ప్రపంచం "యువతరము వారిది" అనే విశ్వాసంవల్ల వారిట్లు అభిప్రాయపడిరి.

గాంధిజీ యొక్క కొన్ని రాజకీయాభిప్రాయాలను గూర్చిన్ని, సత్యాగ్రహ నిర్మాణ కార్యక్రమాలకు గ

అత్యంత సాన్నిహిత్యాన్ని గూర్చిన్నీ ముచ్చటించాక, విదేశ దురాక్రమణం నుండి ఒక దేశ మెట్లు ఆత్మరక్షణ చేసుకోగల దన్న ముఖ్య సమస్య నిప్పుడు పరిశీలిద్దాము. వేర్వేరు సందర్భాలలో, అనేక సత్యాగ్రహాలతో చేసిన అనేక చర్చలలో గాంధిజీ ఈ ప్రశ్నను గూర్చి ప్రస్తావించారు. ఆయా సందర్భాలలో వారు వెలిబుచ్చిన అభిప్రాయాల సారాన్ని వ్యక్తపరచడానికి ప్రయత్నిస్తాను.

బయటినుండి శత్రువులు దాడి వచ్చినప్పుడు ఏ దేశ ప్రభుత్వమైన ఏమిచేయవలసి ఉంటుందని ఒకానొక రాయనను ప్రశ్నించారు. వ్యక్తిగతంగా కేవలం 'సొంతసొత్తు' అనే సిద్ధాంతంపై గాంధిజీకి విశ్వాసం లేదు. ఒకజాతి తన హద్దులలో ఉన్న సహజ సంపదను తన సైనికబలంతో ఇతరులనుండి కాపాడగలిగితే తప్ప, ప్రపంచంలోని ఒక భూభాగాన్ని తన సొంతసొత్తు క్రింద పరిగణింప నేరదని ఆయన మతము. అందుచేత 'జాతి సొత్తు' అంటే, ఆయన మతం ప్రకారం, విస్తృతమైన వ్యక్తిసొత్తు అన్నమాట. అంటే, అది దౌర్జన్యంమీద ఆధారపడి ఉన్నదని చెప్పవచ్చు. అహింసా సూత్రానుసారం బ్రతుకదలచిన జాతి తన దేశపు హద్దులని పరిగణించే భూభాగంలో లభించే సర్వసంపదను తక్కిన మానవ కుటుంబంతో పంచుకోవడానికి సంసిద్ధపడి ఉండాలి. కానుకల రూపంలో ఇతరులకు తోడ్పడ వచ్చును. ఐతే ప్రకృతి లభ్య సంపదలన్నీ విశ్వమానవ కుటుంబానికి అందుబాటుగా ఉండడం ధర్మమన్న సత్యాన్ని అది గుర్తించాలి. ప్రకృతి వనరుల నుండి భాగ్యం పెంపొందించుకొనే నైపుణ్యమే తనకుంటే, ఆ నైపుణ్యంగాని

ఆవిధంగా లభ్యమయ్యే వస్తువులుగాని, వానిని న్యాయంగా పొందదగిన సర్వజనుల కోసము తన రక్షణలో ఉంచిన ధర్మ నిధిగా భావించాలి.

ఒక జాతి అట్టి ఆర్థిక సంపత్తి నిర్మించుకోవాలని యత్నిస్తే, తన ఇరుగుపొరుగు జాతులు, తమ జీవిత ప్రమాణం పెంపొందించు కోడానికి తగినంత సహజసంపద పెట్టిపుట్టక పోతే - అప్పుడాయా జాతులు రెండు భిన్నమార్గా లవలంబించుటకు ప్రయత్నిస్తాయి; మొదటిమార్గం - తన పొరుగుజాతి హద్దులలోని సహజ సంపదలను అత్యున్నత విధంగా అభివృద్ధి చేయుటకుగాను, ఆజాతి తన నిపుణులను పంపవచ్చు. పొరుగు జాతి సహజసంపద కొంచెముపాటిదై, తనది గురుతరమైతే,- వారిని తమతోపాటు తమ ఆర్థికలబ్ధిని పంచుకొని అనుభవించుటకు గాను, సహజీవనార్థము రమ్మని ఆహ్వానించుట ఆ జాతి రెండవ కర్తవ్యం. ఒకవేళ ఆ సంపద వారికి వీరికి సరిపోదనితోస్తే, అప్పుడందరు సమానముగా కష్టించి పనిచేయవలెనే కాని, నైతికముగా పొందదగిన దానిని అవతలవారికి నిరాకరించి, తాననుభవింప కూడదు.

ఒక జాతి అట్లా నిజంగా నైతికపథంలో రాజకీయ-జీవితం గడపాలని ప్రయత్నిస్తూ ఉండగా, ఒకవేళ మరొక జాతి నాయకులు తమపై దురాక్రమణ సలిపారనుకొందాం : అప్పుడు వీరి మొదటి కర్తవ్యం ధర్మబద్ధమైన తమ సంపదలను సత్యాగ్రహ మూలకంగా రక్షించుకోవడం సత్యాగ్రహ దళాలను ఆ దురాక్రమణపరులు కుప్పనూరుస్తా రనుకోవచ్చు;

నామకః ఆ భూభాగాన్ని స్వాధీనం చేసుకొంటారు కూడా! కాని, ఈ నిర్జిత జాతి వారసులు ఆ దురాక్రమణపరులను, సహాయ నిరాకరణోద్యమం ద్వారా ప్రతిఘటించడానికి సిద్ధపడాలి; అంతేకాని ఆత్మరక్షణార్థం దౌర్జన్యయుతంగా కించిత్తూ తిరుగబడ కూడదు.

ఈపద్ధతివలన దురాక్రమణపరుల మనస్సు కరుగుతుందా? అని గాంధీజీని ప్రశ్నించారు. అలా కరిగే అవకాశ మున్నదని మనం నమ్మవలసినదే కాని, ఆ నాయకుల మనస్సు బహుశః కరుగక పోవచ్చునని ఆయన జవాబు. అయితే, దురాక్రమణ చేసిన సేనలో అధిక సంఖ్యాకులు, సామాన్య వ్యక్తులు; వారు దుర్బోధకు చెవి ఒగ్గడంవల్ల తాత్కాలికంగా తప్పుదారి పట్టి ఉంటారు. ఆవిధంగా ఆక్రమించుకొన్న బలగంలోని జనులు, ఆక్రమిత దేశంలోని సత్యాగ్రహులు తమపైని పగదీర్చుకొనే స్వభావం పూనక అయినా, విజేతలనిపించుకొన్న తమకు కించిత్తూ లొంగడాని కిష్టపడక పోవడం గమనిస్తే వారిలో ఆశ్చర్యం అంకురించి కొంచెం ఆలోచనలో పడతారు. సత్యాగ్రహులు అచంచలులై, విజేతలను శత్రువులుగా చూడ నొల్లక, తమ ధైర్యస్థైర్యాలతోను, శాంతియుత ప్రతిఘటనతోను వారిని తమ దృక్పథంవైపు మార్చగల్గుతామనే ధీమా కల్గినవారైతే విజయం సుసాధ్య మవుతుంది. సైన్యంలోని మొత్తం సామాన్య ప్రజకదా! వారి నెప్పుడైతే సత్యాగ్రహులు తమ ప్రక్కకు లాగివేస్తారో అప్పుడు వారి నాయకులు ఒంటరిగా నిలిచిపోతారు - విజయం తథ్యం!.

సహజంగా సత్యాగ్రహి ఈవిధంగా జరుగవచ్చునని ఆశిస్తాడు. కాని కఠినుడైన శత్రువు హృదయాన్ని మార్చడం ఎల్ల వేళల సాధ్యంకాదు. కాని శత్రుసేనలోని సామాన్యభటుల గౌరవాహోదాలను పొందగలిగితే ఆసేనలోని దుష్టశక్తులను వేరుచేయ గలిగితే చాలు. అప్పుడు మానవశక్తికి సాధ్యమయ్యేది పూర్తిగా సాధించినట్లవుతుంది. దురాక్రమణ జరిగినప్పుడు సత్యాగ్రహం నడువవలసిన ఆదర్శ పథమిది. ఈ ఆదర్శ సిద్ధికే తాను కలలు కంటున్న భారతదేశం కృషిచేయాలని గాంధిజీ అభిలషించారు.

చిన్న చిన్న మార్పులను చక్కగా సాధించడానికి దాని నెట్లు ఉపయోగించుడని మనకు ఆయన సలహా ఇచ్చారో కడ కంతర్జాతీయ సంఘర్షణలపట్ల కూడా అదే ఆయుధాన్ని ఉపయోగించడానికి మనం సంసిద్ధమగుటకు గాను, ఆయన జీవితం పొడుగునా మనదేశంలో సత్యాగ్రహం యొక్క స్థాయిని పెంచడానికి ఇతోధికంగా కృషి సాగించారు. మనం గాంధిజీ జీవితాన్ని సమగ్రంగా పరిశీలిస్తే ఆయన ఈలక్ష్యాన్ని ఎట్లు నిశ్చలంగా మనస్సులో పెట్టుకున్నారో తెలియగలదు. పైన సూచించిన సత్యాగ్రహ ఫలితాలను ఆయన ఎట్లు సాధించడానికి ప్రయత్నించారో వర్ణించడమే రేపటి నా మూడవ ఉపన్యాసం ఉద్దేశం.

# III

# భారతదేశంలో గాంధీజీ కృషి

గాంధిజీ తమ ఆశయములను సాధించడానికి ఎట్లు కృషి చేశారో తెలుపుటే ఈ కడపటి ఉపన్యాసంలోని నా ఉద్దేశము.

1915 లో దక్షిణాఫ్రికానుండి ఇండియాకు తిరిగి వచ్చినప్పుడు సత్యాగ్రహ విధానాన్ని అంతకంటె విశాలమైన కార్యక్షేత్రంలో ప్రయోగించాలని గాంధిజీ సంకల్పించారు. దక్షిణాఫ్రికాలో నివసిస్తున్న భారతీయులు కోల్పోయిన హక్కులను, పొందవలసియున్న హక్కులను అక్కడి ప్రజలు సంపాదించుటకే ఈ సత్యాగ్రహాన్ని ఆయన ఆ దేశంలో ప్రయోగించి ఉన్నారు. ఈ నిశిత సత్యాగ్రహాయుధాన్ని ఆయన తయారు చేస్తున్నప్పుడే, భారతదాస్య విమోచనానికిది మహోపకరణము కాగలదని ఆయనకు లోలోన తోచింది. భారతదేశానికి రాగానే ఏ ఉద్యమంలోనూ పాల్గొనక, కనీస మొక యేడాది యావత్ భారతం తిరిగి, దేశపరిస్థితు లన్నిటిని అవగాహన చేసికొమ్మని, ఆయనకు గోఖలే సలహా ఇచ్చారు. అందుచేత ప్రజాజీవిత రంగంలోకి దిగకపూర్వం, ఒక్క సంవత్సరం భారతంలోని వివిధ

ప్రాంతాలు పర్యటించి, భారతీయులు పడుచున్న కడగండ్లన్నీ ఆయన కళ్ళార చూచి గ్రహించారు.

ఆ రోజులలో ఆయన ఇచ్చిన ఉపన్యాసాలలో కెల్ల వారణాసిలోని హిందూ విశ్వవిద్యాలయ ప్రారంభోత్సవ సందర్భంలో ఇచ్చినది ముఖ్యాతి ముఖ్యమైనది. దేశంలోని మహామహులందరక్కడ కాహూతులైనారు; మనదేశ నాయకులలో ఆనిబీసెంటు సతీమణికూడ అక్కడ ఉన్నది. వైస్రాయి కూడా ఉన్నారక్కడ. స్వదేశ సంస్థానాధీశ్వరుల దుస్తులలోని నగలు తన కన్నులు మిరుమిట్లు గొల్పుచున్నవని తన ఉపన్యాసంలో గాంధిజీ అన్నారు. ఆ దృశ్యం లండను నగరంలోని నగల వర్తకుల కానందదాయకం కావచ్చును; కాని ఈ సంస్థానాధీశ్వరులు భారతంలోని దరిద్ర నారాయణులకు ప్రాతినిధ్యం వహిస్తున్నారా? అని ఆయన ప్రశ్నించారు. అసలీ రాజప్రతినిధి వైస్రాయి రక్షకభటుల కాపలాతో ఒక మహాసభకు రావలసిన అగత్యం ఏమిటి? అని మరో ప్రశ్న. అతగాడు నిజంగా ప్రజాప్రతినిధే అయితే, నిజంగా వారి పాలకుడే అయితే అప్పుడాయనను కాపాడే బాధ్యత ప్రజలదే అవుతుంది. కాని అట్టిభావం లేకపోవుటచేత – 'దేశభక్తులం' అనుకొనే ప్రజలు, అతనిపై ఒక్కొక్కప్పుడు బాంబులున్నా విసురుతారు. అప్పుడు బీసెంటు సతీమణి కోపంతో నించొని గాంధిజీని ఉపన్యాసం ఆపవలసినదని అన్నారు. తరువాత ఆ సభ చెదిరిపోవలసి వచ్చింది.

భారత ప్రజా జీవితంలోనికి గాంధీజీ అడుగుపెట్టినరీతి ఇది. అయితే ఆయన ఆశయం విధ్వంసాత్మకమైనది కాదు. దక్షిణాఫ్రికాలోవలెనే ఇక్కడకూడ సత్యాగ్రహం నిర్వహించాలని ఆయన సంకల్పం. అందుకోసం అనుకూలమైన సంస్థ లెక్కడున్నాయా పనిచేయడానికి అని వెదకడం మొదలు పెట్టారు. తనకోసం ప్రత్యేకంగా ఒక సంస్థను క్రొత్తగా నిర్మించుకోవడంకంటె, అప్పటికి ఉన్న ఒక సంస్థలోనే సభ్యుడుగా చేరి, అందులోని సభ్యులందరినీ తన దృక్పథంలోనికి త్రిప్పుకొని ఆ సంస్థ స్వభావాన్నే మార్చివేయడం మంచిదని ఆయన భావించారు తరువాత తన సొంత సమాజాన్ని ఒక దానిని కాంగ్రెసునకు పోటీగా లేవదీయక, కాంగ్రెసులోనే ఏల కలిసి పనిచేస్తున్నారని ఎవరో అడుగగా- ఈ సంస్థలద్వారా ఎంతమంది జనాన్ని వీలైతే అంతమందినీ తన కార్యక్రమాని కనుకూలంగా మార్చవచ్చునని ఆయన జవాబు.

ఆయన కార్యాచరణ పద్ధతి ఇది. తీరా పని చేద్దామనుకొనేసరికి, 'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ' అనే సంస్థ మీద ఆయన దృష్టి పడింది. ఆ సంస్థ చాలాకాలం సాంఘిక రంగంలో బాగా పనిచేసింది. కానా సమాజ సభ్యుడు కావాలని గోఖలే తహతహలాడేవారు. కాని ఆయన చనిపోయారు. గాంధీజీ ఆశయాలు, అభిప్రాయాలూ మిక్కిలి శంకించినవారు పలువురు సభ్యు లందులో ఉన్నారు. అందుచేత, గాంధీజీ సభ్యత్వానికి దరఖాస్తు పెట్టగానే, వారిలో స్పష్టమైన చీలిక ఏర్పడింది. అదిచూచి, గాంధీజీ తన సభ్యత్వపు దరఖాస్తును ఉపసంహరించుకున్నారు.

ఈలోపుగా శ్రీమతి అనీబీసెంటు ఒక నూతన సంస్థను లేవదీసింది; దానిపేరు ది-ఆలిండియా-హోంరూల్-లీగు. ఆమె ఉపన్యాసాలు ప్రజలలో ప్రభుత్వపట్ల తిరస్కారబుద్ధిని ప్రేరేపింప జేస్తున్నాయని ఆమెను జెయిలులో పెట్టారు. కాని, ఇతరదేశాలు రాష్ట్రాలు బ్రిటిషు సామ్రాజ్యంలో సభ్యులుగా ఉన్నప్పటికీ- స్వేచ్ఛాయుతంగా ఉన్నట్లే, భారత దేశంకూడా స్వేచ్ఛా ప్రతిపత్తి గలిగి ఉండాలని ఆమె అభిప్రాయం. ఆయా సామ్రాజ్య భాగాలువలెనే ఇండియాకూడా పౌరసత్వపు హక్కులు అనుభవించాలని అమె ఆశయం.

శ్రీమతి అనీబీసెంటు మదరాసులో నివసించేవారు. అందువల్ల ఆమె నెలకొల్పిన హోం రూల్ లీగ్ ప్రభావం ఉత్తరాదిలో కంటె దక్షిణాదినే ఎక్కువ ఉండేది. ఆ సభా శాఖలు, బొంబాయి మొదలైనచోట్ల ఉండేవి. బొంబాయి శాఖవారు, ఆ సభా ప్రభావం వృద్ధిచెందుటకు గాను, అఖిల భారత గౌరవాధ్యుడైన వ్యక్తిని దాని కధ్యక్షునిగా ఆహ్వానించాలని నిశ్చయించారు; దానికి గాంధీజీయే అర్హులని వారు భావించారు. ఆయనను అధ్యక్షునిగా పిలువవలెనన్న వారిలో మహమ్మదలీ జిన్నా ఉన్నారు. ఇంకా ఎం. ఆర్. జయకర్, కె. యం. మున్షీ తదితరు లనేకులు కూడా ఉన్నారు. కాని వీరిలో జయకరుగారు మాత్రము కాలక్రమమున తమ సంస్థను గాంధీజీ తనకనుకూలంగా మార్చేస్తారన్న అభిప్రాయంతో ఉన్నారు. గాంధీజీకి శాకాహార మనీ, సభా కార్యక్రమాలన్నీ హిందీలో నడపాలనీ కొన్ని పట్టుదల లున్నాయని జయకరుగారికి భీతి. పైగా గాంధీజీకి ప్రత్యేక

చర్యలో నమ్మకం; హోం రూల్ లీగ్ వారికి మాత్రం భారత ప్రజను రాజకీయ విదులుగా చేయడంలోను, రాజ్యాంగబద్ధమైన మార్పులను చేయడంలోను విశ్వాసం.

వీరి కిట్లాంటి భయాలుంటాయని గాంధీజీ ఎరుగును. అందుచేత అట్లాంటి భయం ఉండనవసరం లేదని వారికి నచ్చ చెప్పడానికి ప్రయత్నించేవారు.

జయకరుగారు గాంధిజీవంటి మహామహులు ఈ హోం రూల్ లీగ్ వంటి చిన్న సంస్థలో ఇముడలేరనీ, అంచేత ఆయన ఈ సంస్థలో ప్రవేశించడ మెందుకనీ ముఖ్యంగా వాదించారు. క్రమేణా ఆయన భారం భరించలేక ఈ సభ అంతరించి పోవచ్చు ననీ ఆయన భయం.

ఈ హెచ్చరికను శ్రీమతి అనీబీసెంటు మరీ తీవ్రంగా చేశారు. అఖరికి ఆ సభలో చీలికవచ్చి శ్రీమతి అనీబీసెంటు "నేషనల్ హోం రూల్ లీగ్" అనే ఇంకొక సంస్థను లేవ దీసింది.

కాలం గడచిపోసాగింది; గాంధీజీ ఆ సభలోని సభ్యులను తన ఆశయాని కనుగుణంగా మార్చడం మొదలుపెట్టారు. ఆ సభా కార్యకలాపాలు కేవలం ప్రజలకు రాజకీయాలు నప్పడంతో సరిపెట్టరాదని భావించారు. సామాన్య ప్రజలు క్రమబద్ధమైన సామూహిక చర్య కుపక్రమించకపోతే భారతావనికి భవిష్యత్తు ఉండదన్నారు. ఇంగ్లీషు మాట్లాడే వారికి మాత్రమే కాక, భారత దేశంలోని సామాన్య ప్రజానీకానికి

స్వేచ్ఛ లభించాలని గాంధీజీ ప్రగాఢవాంఛ. అందుచేత, ప్రజలంతా పాల్గొనేలాగున హిందీభాషను వాడాలని ఆయన పట్టు పట్టారు. ఆరోజుల్లో ఆయనకు హిందీ చక్కగా రాదు. వచ్చీ రాని ధోరణిలో మాట్లాడేవారు; అయినా, దానికేమీ ఖిన్న పడలేదు. సరే - అలాంటి పరిణామాలవల్ల శ్రీయుతులు జిన్నా, జయకరు, మున్షీ - ప్రభృతులు చాలామంది ప్రముఖులు ఆ సంస్థను వదిలేశారు.

ఇంతలోపుగా, ఇండియాలో చాలా సంఘటనలు జరిగాయి. మొదటి ప్రపంచయుద్ధం ముగిసింది; ఆపిమ్మట రౌలట్ చట్టం వచ్చింది. భారతదేశంలోని ముస్లిములు ఖిలాఫతు అన్యాయాలకు చాలా నొచ్చుకున్నారు.

ఆదేసమయంలో గాంధీజీ హోంరూల్ లీగ్‌నుంచి నిష్క్రమించడంలో ఏమీ ఆశ్చర్యంలేదు. ఆ సభవారిదే 'యంగ్-ఇండియా' అనే వారపత్రిక. అది బాగా నడవడం లేదు. దాని ముద్రణమునకు బాధ్యత 'బొంబాయి-క్రానికల్' ముద్రణాలయంవారిది; కాని దానిబాకీలు సక్రమంగా చెల్లించడంలేదు. కనుక గాంధీజీ ఆ వారపత్రికను తనకు అప్పగించమన్నారు. బాకీలు సక్రమంగా చెల్లించే పూచీ తమదే అన్నారు. 1919 అక్టోబరులో గాంధీజీ ఆ పత్రికను కైవసము చేసికొన్నది మొదలు, 1931 వరకు ఇంచుమించు సాఫీగా నడచినది. దాని కడపటి ప్రతి 1932 జనవరి 31 వ తేదీని వెలువడింది. ఎన్నోమారులు ఆ పత్రికను ప్రకటించకుండా ఆపివేయవలసివచ్చింది. కాని, అది వేరే గాథ.

ఎలాగయితేనేమి, ఆ పత్రికతో ఆయన బయటికి వచ్చే శారు; తాను సొంతంగా ఒక సంస్థను స్థాపించడానికి మారుగా వీలైతే భారత జాతీయ కాంగ్రెసు ద్వారా తన కృషిని సాగించాలని ఆయన దానిలో ప్రవేశించారు.

అభిప్రాయాలను వెలిబుచ్చడంతోను, తీర్మానాలను ప్రతిపాదించేడంతోను నాటి కాంగ్రెసు సంతుష్టి పడుతోందని గాంధిజీకి దానిని గూర్చిన అనుభవం. వాటిని అమలులో పెట్ట డానికి మాత్రం అది దీక్షగా కృషిచేయలేదు. అది ఇప్పుడింక అవసరంవెంబడిని కార్యరంగంలోకి దూకే రాజకీయసంస్థ కావా లని ఆయన కోర్కె. అందుచేత తానందులో చేరిచేరడంతో రౌలట్ చట్టంగూర్చిన్ని, ఖిలాఫత్ అన్యాయాలను గూర్చిన్ని కాంగ్రెసు ఏదో కొంత కలుగజేసుకోవాలని ఆయన వాదించ డం మొదలుపెట్టారు. కాంగ్రెసు సంస్థలోనే ప్రజాభిప్రా యాన్ని నెలకొల్పాలని ప్రయత్నించారు. కాని, సత్యాగ్రహం నడపడానికి అదే తరుణమనికూడా భావించారు. ఇది 1919 నాటి సంగతి. కాని కాంగ్రెసు ప్రత్యక్షచర్యకెప్పుడూ అల వాటు పడియుండలేదు కనుక, అట్టిచర్యకు గల బాధ్యత కాంగ్రెసుపై బడవేయక, కాంగ్రెసుతీర్మానంవల్ల నెలకొల్పిన వేరు సంస్థపైని ఉంచవలెనని యోచించారు. ఆ విధంగా చేయడంవలన, ఉద్యమంలో మొత్తం కాంగ్రెసు నైతికంగా ఇరుక్కుంటుంది.

కొద్దిమంది సభ్యులతో, "సత్యాగ్రహ సభ" అనుపేరిట ఒక క్రొత్తసంస్థను స్థాపించి, భారతదేశంలో రాజకీయ-సత్యా

గ్రహానికి దానిచేత నాందీపూజ చేయించారు. 1919 నాటి సహాయ నిరాకరణోద్యమానికిదే ప్రారంభం. ప్రస్తుతం దాని చరిత్రలోకి మనం దిగనక్కరలేదు. కాని, ఖిలాఫత్ సమస్యను ఆయన ఎందుకు బలపరచేరన్న ప్రశ్నను మాత్రం చర్చించాలి.

ఇది ఒక తప్పటడుగని వ్యక్తిగతంగా నాకనిపిస్తుంది. కిలాఫత్తును ఒక భారత జాతీయ సమస్యగా ఈయన యెందుకు మార్చేరంటే - అది బ్రిటిషు ప్రభుత్వంమీద దండయాత్రకు ముసల్మానులను కూడా తగిలించడం కోసమే. కాని దురదృష్ట వశాత్తు ఆయన ముసల్మానులను సమర్థించిన సందర్భంమాత్రం బాగాలేదు. వారు పరరాష్ట్రింపట్ల తమవిధేయతను ప్రకటించేరు. భారతీయముస్లిములు ఖలీపునే తమ నిజనాయకునిగా పరిగణించే వారు. ముస్లిము లేదేశంలో నివసించినా వారి నిజనాయకుడు ఖలీపుమాత్రమేనని ఆరోజులలో ఖిలాపత్ ఉద్యమ నాయకులు తమ ఉపన్యాసాలలో చాటి చెప్పేవారు.

పరరాష్ట్రి వాసికి భక్తితో అంకితమైన వారి ఉద్యమాన్ని గాంధిజీ బలపరచడం తప్పే. ఇదే ప్రఖ్యాత చరిత్రకారుల అభిప్రాయం కూడా! కాని, పలువురు మరచే సంగతి ఇక్కడ ఒక్కటుంది. ఇలా, ఖిలాఫత్తును బలపరచినది గాంధిజీ ఒక్కరేకాదు. ఆయనకు పూర్వమే కిలాఫత్తు కండదండలుగా నిల్చిన బాలగంగాధరతిలకు పేరు ఈ సందర్భంలో నాకు వెంటనే జ్ఞప్తికి వస్తున్నది. ఈ విధంగా వారిని బలపరస్తున్న వారిలో బిపిన్‌చంద్రపాలు గారొకరు. జాతీయోద్యమానికి సంబంధించిన ఈ ఇద్దరుద్దండులున్నూ అసలు ఖిలాఫత్ - ఆంధ్రో

కన నెందుకు బలపరచేరా అన్నది దురూహ్యాం. కాని వా రట్లా చేశారు. తిలక్ నాయకత్వం క్రింద సాగిన కాంగ్రెస్ డెమాక్రటిక్ పార్టీ పక్షాన ఈవిధంగా చెప్పడం జరిగింది. "తురుష్క నిష్కర్ష మత సూత్రాలు, విశ్వాసాలు, కొరాను-ఆదేశాల ననుసరించి, ఖిలాఫత్తు సమస్యా పరిష్కారార్థం ముసల్మానుల హక్కును ఈపక్షం బలపరుస్తున్నది" అని! ఈ అభిప్రాయానికి తిలక్ గా రెట్లా సమ్మతించేరా అన్నది అత్యాశ్చర్యం. తిలక్ అంటే ఎనలేని గౌరవంగల జయకరు కూడా తరువాత ఆ చర్యకు ఆశ్చర్యం వెల్లడించారు. బిపిన్‌చంద్రపాలుగారి వాదం, కొంత వేరువిధంగా ఉంది : "వ్యక్తిగత విశ్వాసాల మూలమున గాక, ఉన్నత రాజకీయ కారణాలవల్ల, ఈ ఉద్యమంతో నేనేకభవిస్తున్నాను, భారతజాతి భవిష్యత్తు, స్వాతంత్ర్యం, బ్రిటిషు సామ్రాజ్యం యొక్క స్వేచ్ఛ, సమైక్యత, రక్షణముల మీద పూర్తిగా ఆధారపడి ఉంది" అన్నా రాయన. టర్కీ జారిపోతే పశ్చిమ-ఆసియా నిస్థానాలు కూడా జారిపోయి అవి క్రిష్టియనుల అధికారానికి లోనై పోతాయని ఆయన భయం. టర్కీవంటి ఇస్లాం రాష్ట్రం భారత దేశానికి, పాశ్చాత్యులకూ మధ్య, కాస్త అడ్డుగా పడిఉండడం మంచిదని ఆయన భావించారు. కాని, నలువదేండ్లయిన తర్వాత, నేడు ఇటువంటి వాదాలు ఏమీ నచ్చుబాటుగా తోచవు.

కాని, ఖిలాఫత్‌ను గూర్చిన నిందలన్నీ గాంధిజీ నెత్తిమీద గ్రుమ్మరించారు. బ్రిటిషువారు ముసల్మానులకు కల్గించిన గాయాలను మాన్పాలని తాను వాంఛిస్తున్నా నంటూ రాయన. కొన్ని విధాలుగా చూస్తే, అది నైపుణ్యంతో కూడిన ఎత్తే

కూడా. బ్రిటిషు ప్రభుత్వంపైకి యుద్ధానికి ముసల్మానుల నుసిగొల్పడానికి, ఇంతకంటె మంచి ఎత్తాయనకు కన్పించలే దనుకొంటాను. బహుశః ఇది గొప్ప తప్పటడుగేమోకూడా. ఎందుచేతనంటే ఈ అన్యరాష్ట్రభక్తివల్లనే పాకిస్థానవతరించింది! కాని అది ఇంకొక కథ.

అప్పటికప్పుడే జలియన్వాలాబాగ్ కాల్పులు, పంజాబు దారుణాలు జరిగిపోయాయి. అవచారపరంపర పెరిగిపోయింది. సహాయ నిరాకరణోద్యమం దొర్లిపోయి, 1922 లోని చౌరీ-చౌరా సంఘటనల దగ్గరకు వచ్చాము. అప్పుడు, తక్కిన మన రాజకీయ నాయకుల మాట కాదని, గాంధీజీ ఉద్యమాన్ని నిల్పివేశారు. ఆయన అలా ఎందుకు చేశారో అర్థం చేసికోవడం చాలా అవసరం. దౌర్జన్యానికి ఎంతమాత్రం భయపడలేదని గాంధిజీ స్పష్టంగా చెప్పాను. అక్కడక్కడ దౌర్జన్యం సంభవిస్తే దానికి తగిన చర్య తీసికోవాలి. కాని అంతకంటె ముఖ్యతరమైన విషయం ఏమిటంటే- ఎంత అత్యావసర పరిస్థితులలో నిబంధింపబడిన నియమాలైనా, వానిని తానవలంబించిన సంస్థ అక్షరశః పాటించి తీరాలి. నిజానికి, పామరప్రజలు చేసిన దౌర్జన్యంకంటె కాంగ్రెసు జనము చేసిన దౌర్జన్యమే తన్ను క్రుంగదీసిన దన్నారొకమాటాయన. తాను నడపుచున్న సంస్థయే తన ఆజ్ఞను శిరసావహించకపోతే- పోరు సాగుచున్న కొలదీ, సంఘర్షణమీద సంఘర్షణ జరిగినకొలదీ, సుశిక్షితము కాని సంస్థ, కడకు దెబ్బతింటుంది. అందుకే చౌరీ-చౌరా సంఘటన పిమ్మట ఆయన ఉద్యమాన్ని హఠాత్తుగా నిల్పివేశారు.

ఈ మొదటి సత్యాగ్రహాన్ని గురించి మనం గుర్తింప వలసిన మరొక్క విషయముంది; ఉద్యమం ప్రారంభింపక మునుపే, సత్యాగ్రహయోధులు తయారుచేసికోవాలన్న సిద్ధాంతం కాదాయనది; సామాన్యప్రజ తెల్లాగుంటే అల్లాగే, ఉద్యమం ఆరంభించాలని ఆయన సిద్ధాంతం ప్రజలందరితోనూ అసహాయోద్యమ మారంభించే పద్ధ ఆయన సూచ్న. దీనికిగాను ఆయన పంపిణి అనుక్రమబద్ధంగా విరచించేవారు. ఇందుచేత, 1921 నాటి మొదటిసారి సత్యాగ్రహంలో ఆయోధులు కొద్ది నెలలు నిర్బంధం, తత్తుల్యమైన కష్టాలు మాత్రమే పడవలసి ఉంటుందని వారు భావించారు.

ఈలోపుగా, గాంధిజీ తమవలను పల్లెలలోకి విస్తరించాలని కూడా వాంఛించారు. సత్యాగ్రహానికి కావలసిన తయారీకిన్నీ, ఆర్థిక వికేంద్రీకరణానికిన్నీ చాలా సన్నిహిత సంబంధం ఉన్నది. ప్రజాసేవకులైన పనివారిని పల్లెలలోకి పొమ్మని కోరారు. వికేంద్రీకరణ ప్రాతిపదికమీద, క్రమంగా ఆర్థిక సంస్థను నిర్మించాలని ఆయన కాంత. వారి ప్రయత్న మిట్టిదై ఉండగా కాంగ్రెసువారికి చాలా ఆవేదన కల్గింది: "మీర చేసేదేమిటి ? ప్రజలను పల్లెలలోనికి పొమ్మంటూరేమండి వాలంటీర్లు రాట్నం వడికిన్నీ, ఏదో నిరర్థక నిర్మాణంలో నిమగ్నులయిన్నీ వృథా కాలక్షేపం చేయడమెందుకు ?" ఇత్యాది ప్రశ్నలు కాంగ్రెసు నాయకులాయనను వేయడం మొదలుపెట్టారు. కాని, మనం నిజంగా సత్యాగ్రహానికి శిక్షణ పొందేవారమైతే, ఆ విధాన మవలంబించడ మనివార్యమనీ, అందుచేత ఆ శిక్షణ విధిలేక పొందడం కాక తెలివిగా పొందా

లనీ ఆయన పట్టుపట్టారు. మొత్తంమీద ఆయన పథకాలను అర్ధాంగీకారంగాను, తరచు అనర్థంగాను, అధ్వాన్నంగాను కొనసాగించారు. "బాపూ ! జమీందారుల దుర్న్యాయాలమీదికి మనం దాడి ప్రారంభిస్తే ప్రజలు వెంటనే ఉత్సాహపూరితు లౌతారు. మనం అహింసావిధానంలో విజయం సాధించాలంటే ఏల ఈ సదవకాశం వినియోగించుకోకూడ"దంటూ, ఒకప్పు డొక రాజకీయధురంధరుడు హెచ్చరించాడు. "నీ కట్టి నమ్మక ముంటే, అలాగేకానీ! కాని, అనుభవశాలిగా, నేను నీకు చెప్పదగ్గది మాత్రము వేరు; ఒక పోరాటంలోనికి మనం దిగిన కారణ మెప్పుడూ, ప్రాంతీయమైనదిగాక యావద్భారతానికి సంబంధించినదిగా, సాధ్యమైనదిగా ఉండాలి" అని బదు లిచ్చారు.

1930 లో యావద్భారతాన్ని ఉప్పు సత్యాగ్రహంలో ఆయన దింపిన కారణం ఇదే. ఉల్లంఘించడానికింకేవీ శాసనాలు లేవని కాదు; కాని, మిక్కిలి చిన్న శాసనం ప్రజాబాహుళ్యానికి సంబంధించినట్టిది ఎంచుకొన్నారు. ఆయన శాంతి సమర నైపుణ్యాలలో ఇది ఒకటి. "భూమి శాసనాలు పట్టుకోరేం ? వాటితో మొత్తం దేశానికి సంబంధించి, భారీఎత్తున ఏదైనా చెయ్యవచ్చుకదా?" అని ఆతరుణంలో ఎవరో ఆయనతో అన్నారు. కాని దాని కాయన ఇచ్చిన జవాబేమిటో ఎరుగుదురా? "ఒకమూల బ్రిటిషువారితో పోరాడుతోన్నప్పుడు, జమీందార్లతో దెబ్బలాడను. బ్రిటిషువారి బలం క్షీణింపచేస్తే జమీందార్లు కూడా నిలబడనే లేరు" అన్నారు.

మళ్లీ 1942 లో ఇలాంటి ప్రశ్నే ఒకటి వచ్చింది. లూయీ ఫిషరు, "హిందూదేశం స్వతంత్రమైతే- ఈ భాగ్యవంతులంతా ఏమిచేస్తారని మీ అభిప్రాయం?" అని గాంధీజీని అడిగారు. భాగ్యవంతు లేనాడూ బీదలతో సహకరించలేరు. వారి ఆధిక్యాన్ని వారెన్నడూ విడువరు. అందుచేత గాంధీజీ- "వారు పలాయనం చిత్తగించి సహకరించ గలరు!" అన్నారు. వారేమీ దెబ్బలాడలేరు; వారి మనుగడకు వారు బ్రిటిషు ప్రభుత్వంమీద ఆధారపడి ఉన్నారు. ఇంగ్లండులో మధ్యతరగతులవారు స్వయంగా పోరి ఆధిక్యంలోకి వచ్చారు. ఇండియాలో మధ్యతరగతులవారు, చాలామంది శ్రీమంతులు కూడా, బ్రిటిషు పాలనవల్ల ఏర్పడ్డారు. అందుచేత, బ్రిటిషు ప్రభ పోవడంతో, తక్కినవారినిగూర్చి ఏమీ గాభరాపడ వవసరముండదు.

ఇప్పుడీ ఉదాహరణలను నేను మీ ముందుంచడానికి రెండు ముఖ్య కారణాలున్నాయి : ఒక టేమిటంటే, ఆయన పక్కలో ఎంతమంది ప్రజలను పిలైతే అంతమందినీ ఇరికించడం ఒక పన్నకం; రెండవది సత్యాగ్రహంలో క్రమశ్రేణి నిర్మించడం. ఈ రెండవ సూత్రం జ్ఞాపక ముంచుకోవడం చాలా అవశ్యకం; ఎందుకోసమంటే. 1930లో ఎదుర్కోవలసిన కష్టం యొక్క స్వభావం, 1921 నాటికంటె కఠినతరమైనది. బహుళ ప్రజానీకం ఉద్యమంలోకి దిగిపోయారు. 1930-32 అసహాయోద్యమ మణచడానికి బ్రిటిషుప్రభుత్వ మపారబల ముపయోగించవలసి వచ్చింది. తలలు బ్రద్దలైనవారికి చెఱసాలకు పోవడం వగైరా శిక్షలు లోచ్చుగా కన్పట్టాయి. 1921 లో

ముప్పదివేల జనం జైళ్ళకు పోయేరు. తరువాతి ఉద్యమంలో బహుళః ఇంతకు రెండురెట్లు పోయేరు. ప్రభుత్వం కూడా తెలివి మీరారు - సామూహికపు జుల్మానాలు వేశారు. దీనితో కొందరు భయపడి వెన్కంజ వేసినా, తక్కినవారు ముందుకే కదం త్రొక్కారు.

కాని అప్పటికింకో సంగతి జరిగింది. అసహాయోద్యమంలో ఒక స్తంభన వచ్చింది. మామూలుగా సత్యాగ్రహులు ఒక జైలునుండి ఇంకో జైలుకు వెళ్లేవారు. భారతమందంతటా ముఖ్యంగా బంగాళం, బొంబాయి మొదలైన రాష్ట్రాల లోనూ పోలీసులను ధిక్కరించే వీరోచిత చర్యలు ప్రబలి పోయాయి. కాని ఇంచుమించు దాగుడుమూతల యుద్ధంవచ్చి విర్దిష్ట చర్యకేమీ సూచనలు గోచరింపలేదు. ఈ స్థితిలో గాంధిజీ చక్కని ఎత్తు వేశారు దౌర్జన్యరహితంగా ప్రభుత్వం యొక్క ఉప్పు కొఠారులను స్వాధీనం చేసుకోవలసిందిగా ప్రోత్సహించారు. 'దర్శన', 'వడల' గ్రామాలలో ఈ దాడులు జరుగుచున్నపుడు దేశమంతటా అసహాయోద్యమం ప్రజ్వరిల్లింది. క్రమంగా ప్రజలకు కాల్పుల భయం చాలామట్టుకు తగ్గిపోయింది. సత్యాగ్రహంలో క్రమశ్రేణిని నిర్మించడమంటే ఇది. ఈ లోపుగా అసహాయోద్యమం అడుగంటిపోవడం మొదలు పెట్టింది. ప్రజలలో ఉత్సాహం సన్నగిల్లుతున్నదని గమనించి ఇంకో ధైర్యమైన అడుగువేశారు గాంధిజీ. క్రమంగా వెనక్కి

ంకమన్నారు. అందుకోసం ముందు అసహాయోద్యమాన్ని
గ్గయిన కొద్దిమంది సత్యాగ్రహులకే పరిమితం చేశారు. తరు
ాత, కొన్ని వారాలైన తర్వాత "సత్యాగ్రహం" నాకే పరి
ంతం చేసికొంటున్నా నన్నారు.

ఇంతలో కాంగ్రెస్‌లోపల మరికొన్ని విశేషాలు జరు
గుతూ వచ్చాయి. కాంగ్రెసులోని సభ్యులకు విసుగు పుడు
తోంది. "అహింసయే పరమ పరీక్షనీ, నూలు వడకడమే సత్యా
గ్రహికి ముఖ్యాతి ముఖ్య లక్షణమనీ మీరు ప్రవర్తిస్తే - ఇంక
భారతానికి రాజకీయ స్వాతంత్ర్యం మీ రెలా సాధిస్తారో మా
కేమీ బోధపడడంలే"దని వారు గాంధిజీతో మురమురలాడటం
మొదలుపెట్టారు. కాని నేను నిన్నటి ఉపన్యాసంలో సూచించి
నట్లు - ప్రజలనెప్పుడూ క్రమశిక్షణలో పెట్టడం, దానికితోడు
కేంద్ర వికేంద్రీకరణంద్వారా వారికి బలము కల్పించి, ఆర్థిక
దుస్థితి నతిక్రమించేలా చేయడం, ఆయన ఆశయమై ఉన్నది.
అది క్రియలో ఎంతమట్టుకు సాధ్యమో నాకు తెలియదు. కాని
ఏది ఏమైనా మేధావులందరూ గాంధిజీకి క్రమంగా దూరం
కావడం మొదలుపెట్టారు. 1921 లోని అసహాయోద్యమం
తర్వాత, అట్లాయనను వదిలివేసిన మొదటివారిలో ఒకరు
'దేశబంధు' సి. ఆర్. దాసుగారు. ఒకమారాయన తన ఉప
న్యాసంలో చాలా ముఖ్యమైన సంగతి ఒకటన్నారు. "అసహా
యోద్యమపు విధానంలో కొన్ని ప్రత్యేక నిర్బంధాలు కల్పిం

చడం నాకేమీ ఇష్టంలేదు; నా ఉద్దేశంలో కాంగ్రెసు ఈ నిర్బం ధాలను తొలగించివేయాలి. కొన్ని ప్రత్యేక శాసనాలను ఉల్లంఘించడాని కాయా ప్రజ లర్హులగుటకు, వారేల నూటికి ఎనుబది మందైనా శుద్ధ-ఖాదీధారులై ఉండవలెనో, నాకు చాలా దురవగాహంగా ఉంది సామాన్య ప్రజానీకం శాస నోల్లంఘనం చేయడం నాకు సమ్మతంకాదు. నా మనస్సు కది అసంభవ మనిపిస్తుంది" అని ఆయన అన్నారు.

దేశబంధుడు నిశ్చయంగా మన మహా జాతీయ నాయకు లలో ఒకరు కాని, సామూహిక శాసనోల్లంఘనం విజయా వహం కానేరదని విశ్వసించినవారిలో ఆయన ఒకరు.

కాలక్రమాన, కాంగ్రెసులో అభిప్రాయభేదాలు ప్రబలం కాజొచ్చాయి. 1934 లో యుద్ధం వచ్చినప్పుడు తన అభిప్రాయాల కనుగుణంగా కాంగ్రెసును మరొక్కసారి సరి దిద్దడానికి గాంధిజీ పనుకట్టడం ముఖ్యవిషయం. "మహాజను లారా! భారతదేశంలో, సాంఘిక సమానత్వాన్ని సాధించ డానికి మనమేమి చేయవలసిఉన్నదో కృతనిశ్చయులంకావాలి. భారతదేశానికి కావలసిన బలం చేకూరిస్తే, మనకు సైన్యం అక్కరలేదు ఏమందురా- మనదేశ రక్షణకు సత్యాగ్రహమే సాధనీపాయము" అని ఆయన ప్రబోధించారు. గాంధిజీ 1939 లో ఈ అభిప్రాయాలను విస్తరించడానికి ప్రయత్నిం

చారు; సత్యాగ్రహంపై ఆధారపడిన తన రక్షణ పథకంలో
వ్యక్తి, తనదేశంలో అహింసాత్మకమైన ఆర్థిక విధానాన్ని నెల
కొల్పడ మత్యావశ్యకమని ప్రబోధించారు అంటే- ఆర్థిక,
సాంఘిక సమానత్వం సాధించుటలో నిశ్చిత ప్రయత్నమన్న
మాట. అట్లు తగినంత బలం సేకరించినప్పుడు, దానిని అంత
ర్జాతీయ రంగంలో ప్రవేశపెట్టాలి. ఎంతచెప్పినా, గాంధీజీ-
సలహా కాంగ్రెసుకు రుచింపలేదు. అందుచేత, తన పరతు
లామోదయోగ్యం కాకపోతే, యే ఉద్యమాన్ని నడపడానికి
తాను బాధ్యత వహించనని ఆయన అన్నారు.

కథలో ఆఖరుభాగానికి వద్దాం; యుద్ధానంతరం, చాలా
కారణాలవల్ల భారతదేశంతో బ్రిటిషువారు రాజీకి రావాలని
అనుకొన్నారు. దీర్ఘకాలిక యుద్ధంవల్ల వెనుకటికంటె వారికీ
నాడి నీరసించింది. "భారత-జాతీయ-దళం" ఒకటి (ఇండియన్
నేషనల్ ఆర్మీ) సుస్వరూపం దాల్చింది. బ్రిటిషు-భారతీయసేన
నొకవేళ సామ్రాజ్యక్షేమరక్షణకు పిలిస్తే, ఇప్పుడు వారెంత
ఆదుకొనేదీ సంశయాస్పదం. అది, భారత జాతీయదళంవద్ద
నేర్చిన క్రొత్తపాఠం. సైనికదృష్ట్యా భారత జాతీయ దళోద్య
మం వ్యర్థమైనా, రాజకీయంగా అది ఘనవిజయం సాధించింది.
ఈలోపుగా ఒకవేళ తాము భారతభూమిని వదలిపోవడమేవస్తే,
దానిని రెండు, మూడు ముక్కలుగా చేసి మరీ పోవాలనీ
బ్రిటిషువారూహించారు; తత్రాపి, భారతదేశం నీరసావస్థలో
పడి, దాని రక్షణార్థం మళ్లీ తామే శరణ్యం కావచ్చునని వారి
ఊహ.

వారు ముఖ్యంగా స్వదేశ సంస్థానాధీశ్వరులపై ఆధార పడ్డారు. దానికి కారణం, అట్టివారు అరువందల ఒక్కరు, బ్రిటిషు దొరలనుండి స్వతంత్ర రాజ్యప్రతిపత్తి గణించి, వారి చెప్పుచేతలతో ఉండడానికి సంసిద్ధపడడమే!

బ్రిటిషు పార్లమెంటు ఆమోదించే ఒక రాజ్యాంగం నిర్మించుకోడానికి, మనకొక రాజ్యాంగ పరిషత్తు ఉండాలని బ్రిటిషు ప్రభుత్వంవారు సలహాయిచ్చిన సందర్భ మిది. ఇంకా కాంగ్రెసు, ముస్లింలీగు లొండొరు లొక ఒప్పందానికి రాకుం డానే, ఇట్టి పరిషత్తును బ్రిటిషువారు మనకు దానంచేస్తున్నారు గాని, స్వశక్తివల్ల మనకిది సంక్రమించని కారణంచేత, ఈ రాజ్యాంగ పరిషత్తును కాంగ్రెసు స్వీకరించరాదని గాంధీజీ మాత్రం హెచ్చరించారు. "బ్రిటిషువారి ఇచ్ఛాపూర్వకమైన సహకారంవల్ల రాజ్యాంగ పరిషత్తును మీ రంగీకరిస్తే - భారతీయులైనా, ఐరోపియనులైనా, మొత్తంమీద బ్రిటిషు సైన్యాల రక్షణంలో, పరోక్షంగా గాని, ప్రత్యక్షంగా కాని, మీరుండవలసివస్తుంది" అని 1946 డిసెంబరు నెలలో కాంగ్రెస్ కార్యాచరణ సంఘాన్ని, ఆయన హెచ్చరించారు. గాంధీజీ కక్షతలో యెంతటిదో నష్టభాగులమై మన మీనాడు గ్రహిస్తున్నాము. ఏమైనాసరే మరో సత్యాగ్రహోద్యమమే గాంధీజీ మనస్సులోని మార్గాంతరం. కాని- "మీరు మాతోనే అంటే కాంగ్రెసుతోనేకదా, కలిసి పనిచేయవలసి ఉంది; అయితే, మేము చేయదగ్గ యుద్ధ మింకేమీ లేదేమో అని మా భయం" అని కొందరు కాంగ్రెసు నాయకులు గాంధీజీతో వాదించడం మొదలుపెట్టారు. "అయితే, మీకేది మంచిదని

తోస్తే, అట్లా చెయ్యండి. మనం సంపాదించిన స్వరాజ్యం చాలా సత్త్వహీనమైన స్వరాజ్యమని ప్రజలు గుర్తించేదాకా, నేను కాలబద్ధుడనై విశ్రాంతి తీసుకొంటాను" అని ఇంచు మించుగా గాంధీజీ వారితో ఇట్లు బదులు పలికారు.

భారతదేశ మహానాయకులకు కార్యక్షేత్రాన్ని విడిచి పెట్టారాయన. వారున్నూ పదంపడి బ్రిటిషువారితో ఒప్పందానికి వచ్చేశారు. ఆక్షణంలో ఒక వింత సంఘటన జరిగింది. ఆయన రైలులో ప్రయాణం చేస్తున్నారు. అప్పుడే మౌంటు బాటెను ప్రభువుతో ఆయన కొక సమావేశం అయింది. ఆయనను రైలులో నేను చూచాను. ఆ రాజప్రతినిధితో తాను చేసిన సంభాషణను ముచ్చటిస్తూ, "చూశావా ? మౌంటుబాటెను ప్రభు వేమన్నాడో; 'కాంగ్రెసు ఇంకెంతమాత్రం వాతో లేదట - తనతోనే ఉందట!' అన్నారు వుగ్రంగా. "అయితే మీ రేమన్నా రప్పుడు ?" అని నేనడిగేను. కాని భారతదేశ మింకా నాతోటే ఉందిలే, అన్నాను" అని ఆయన జవాబిచ్చారు.

యావద్భారతం మతతత్త్వంతో నిండిపోయిందనీ, ఇంచుమించు ప్రతివ్యక్తీ ముస్లిం నుంచి హిందువును వేర్పాటు చేసే ధోరణి అవలంబించారనీన్నీ ఆయన భావించారు. కొద్ది నెలలు కాకుండానే వారితప్పు వారు గ్రహిస్తారనీన్నీ, అప్పుడు ఇంకొక్కమారు తానై ప్రాముఖ్యం వహించే అవసరం వస్తుందనీ ఆయన అనుకొన్నారు.

స్వాతంత్ర్యం వచ్చాక చాలా నెలలు గాంధీజీ జీవించి ఉన్నారు. ఆ కాలంలో మళ్ళీ భారత ప్రజానీకంమధ్యకుపోయి నిల్వాలని వాంఛించారు. అందుచేతనే ఇంక నాల్గురోజులకు తనువు చాలిస్తారనగా ౨౬ వ తేదీన, కాంగ్రెసు సంస్థ నిక రద్దుచెయ్యాలని తమ మరణశాసనంలో లిఖించారు. కాంగ్రెసు సంస్థ పని తీరిపోయింది; దానంతటది ఇంక విలీనమైపోవాలి. కాంగ్రెసు కార్యకర్తలు, భారతావనికి నిజమైన స్వాతంత్ర్యం నిర్మించే సమయమింక వచ్చింది. నిజమైన స్వాతంత్ర్యమంటే సాంఘిక, వైజ్ఞానిక సమత్వమని వారి ఆశయం.

